JAGATI Rs. 2-00 October 1992

37th Year of Publication

435

అక్టోబరు - 1992

## సాహితీ సుధ

దురిత నిదానముల్ సకల దోషగృహంబులు సారహీనముల్
పరిణతి ఘోరముల్ విషయ పద్ధతు లెంతయు కుత్సితంబు లి
ద్ధరను బరోపకార సుకృతంబును బోలవు పుణ్యముల్ మనోహం
తర వస్తువుల్ కువలయాక్షుల కన్నను గల్గ వెవ్వియున్

—భర్తృహరి

చేసినను పవారి సేయమి సోమరి - ఫలము గోరక చేయు భక్తివరుడు
పొగడిన బ్రౌఢుండు పొగడమి మూఢుండు - నిరవెర్గి పొగడ కవీశ్వరుండు

వలెనన్న సంసారి వలదన్న నిర్మోహి - వలద నర్పితమన్న వరప్రసాది
తలచిన సువిదాని తలపమి నద్వైతి - తన్ను మర్వ దలంప తత్వవిదుడు

అట్లుగాన దజ్ఞులగు మహాభక్తుల - సరసలింగ కవుల సత్ప్రసాద
రతుల బరమ తత్వయుతుల మహాత్ముల - జేర్చవయ్య నన్ను జెన్నమల్లు

—పాల్కురికి సోమనాథకవి

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004.
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 50-00- 4 సం॥లకు రు. 100-00 - జీవిత
చందా రు. 300-00. పాట్రన్ - 1000-00. విదేశాలకు : అ॥ డాలర్లు 75.
ముఖచిత్రం : బాపూజీ

# నిమ్మతొనలు

మంత్రి పరాంకుశం వద్దకు ముగురు జర్నలిస్టులు వచ్చారు. ముఖాలైతే తెలుసు గాని వారి పేర్లు తెలియవు మంత్రిగారికి.

'సార్, మీ దగ్గిరికి మేము ఒక పని మీద వచ్చాము' - ఆ ముగ్గురికీ లీడరైన సుదర్శనం.

'పని లేకుండా వస్తారుటయ్యా - నాకు తెలుసు. మీ అభ్యర్థన ఏమిటో చెప్పండి,' - అన్నాడు పరాంకుశం.

'మా ముగ్గురినీ 'బాస్' ఏక కాల మందు పనిలో నుంచి తీసేశాడు.'

'అయ్యో పాపం - కోర్టుకెళ్లక పోయారా?'

'వెళ్లినా, మేము నెగ్గే అవకాశం లేదు. బలవంతులవీ, ధనవంతులవీ రోజులాయె,' - అన్నాడు సుదర్శనం.

"మరి, ఏంచేయదల్చుకున్నారు?"

'మేము ముగ్గురం కలిసి ఒక పక్ష పత్రిక పెడదామనుకుంటున్నాం.'

'శుభం'

'తమరు ప్రారంభోత్సవం జరపాలని....'

'ఓ - దానిదేముంది - నిక్షేపంగా చేస్తాను. ఇంతకీ అది అధికార పక్ష పత్రికా, ప్రతి పక్ష పత్రికా?'

—మంబాల శ్రీనివాసరావు
ఫిరంగిపురం

దమయంతి కుక్కపిల్లని పెంచాలని సరదాపడి ఎగ్జిబిషన్‌లో మూడు వందల రూపాయిలకి టామీని కొని యింటికి పట్టుకొచ్చింది. పాలు, డాగ్ బిస్కట్లు, బ్రెడ్డూ - దాని కంతా స్పెషల్ ఫుడ్. వారం తిరక్కుండా బాగా మాలిమి అయి, దమయంతి వాళ్లోనే తప్ప కిందకూచునేది కాదు టామీ. గేటు దాటి వెళ్లేది కాదుగాని, వాకిట్లోను యింట్లోను కలయ తిరిగేది.

ఒక రోజున వున్నట్టుండి టామీ మూతి బంతిలా అయింది - ఏదో పురుగు కుట్టి! దమయంతి ఒకటే కంగారుతో 'వెట్' వద్దకు తీసుకు వెళ్లింది.

'రెండు మూడుసార్లు వేన్నీళ్లతో కాపడం పెట్టండి - అదే తగ్గిపోతుంది' - అన్నాడు డాక్టరు.

'అయింట్‌మెంటుగాని, యింజక్షన్ గాని....'

'ఏమీ అక్కర్లేదండీ'

'యాస్ప్రో యిస్తే, ....'

'దానికొకటి యిచ్చి, మీరు రెండు వేసుకోండి' - అన్నాడు డాక్టరు.

—కె వెంకటరామ్
పామర్రు

చిన్ననాటి మిత్రుడు ఆనంద్ మెడిసిన్ పూర్తయాక, ఒక నర్సింగ్ హోమ్ ప్రారంభించాడని విని, సంతోషించాడు రంగారావు. ఎప్పటి కప్పుడు ఆ నర్సింగ్ హోమ్ చూసి వద్దామని అనుకుంటూనే వాయిదా పడుతోంది. ఆరు నూరైనా యివ్వాళ చూసిరావాలనే పట్టుదలతో బయలు దేరాడు.

విసిరేసినట్లు ఊరు చివర వుంది ఆ నర్సింగ్ హోమ్.

'ఆనంద్, నీ వైద్యం కోసం యింత దూరం ఎవరొస్తారు ?' అని ప్రశ్నించాడు రంగారావు.

'ఎదురుగా కరాటె నేర్పే మైదానం వుంది చూడు - వారంతా రావలసింది ఇక్కడికే - నువ్వు సాయింత్రం వేళ వచ్చావుగాని పొద్దుటి పూట వస్తే, తలెత్తి చూసే టైము కూడా వుండదు.'

—పియమ్ సుందరరావు
విజయవాడ-8

పెళ్లయినప్పట్నుంచీ చూస్తున్నాను - మీమాటేదిగాని ఎదుటవారి మాట వినిపించుకోరు' అంది లలిత తన భర్త సదాశివంతో.

'ఆఫీసులో అందరూ నన్ను ఎంతో మంచివాడని మెచ్చుకుంటారు' - అన్నాడు సదాశివం.

'మీగురించి వాళ్లకేం తెలుసు - కాపరం చేస్తున్నా నాకు తెలియాలి గాని ! మీరు మారాలంటాను.'

'అంటే, నీవు చెప్పినట్లు నడుచు కోమనే కదా ?'

'అవును - మీరు మారాలి.'

'ఈ లోకంలో మారనివి కొన్ని వున్నాయి, లలితా.... నిన్ను కట్టు కున్న నా తలరాత వంటివి.'

—యమ్ సోమశేఖర్
అమలాపురం

# పాఠకుల తీర్పు

చందూర్‌గారికి : జూన్ సంచికలో కాశీ పట్నం రామారావుగారి కథ ఆధారంగా తీసిన 'యజ్ఞం' చిత్రం గురించి చదివాను. అది విడుదల అయిందా ? ఆ కథల పుస్తకం ఎక్కడ దొరుకుతుంది ? 1992 మే 18 వ తేదీ మీ రేడియో టాక్ వినలేదు గాని చదివి ఆనందించాము. జులై సంచికలో 'పేటెంట్ - లా' గురించి, సరళగారి అబ్బాయి సాయినాథ్ చెప్పినది ఎంతో విజ్ఞానదాయకంగా ఉంది. ఇటువంటివి తెలుగులో చదువు తున్నప్పుడు మరింత బావుంటుంది.

— టి సుశీలాదేవి

మద్రాసు - 14

ప్రియ మిత్రులకు వందనములు. శిల్ప చిత్రకళల పేరిట అప్పుడప్పుడు మీరు వీలైనంతలో చక్కటి చిత్రాన్ని 'జగతి' కవరుపై వెలువరించడం సంతోషదాయం. నేనెరిగినంత వరకు, ఇప్పటికీ ప్రజా బాహుళ్యంలోకి శిల్ప చిత్ర కళలు రాలేదు. మీరు ప్రచు రించిన 'విలపిస్తున్న వృక్షరాజం' చిత్రం బాగుంది - ప్రయోజనపరమైన మంచి చిత్రం.

—పిలకా లక్ష్మీనరసింహమూర్తి

మద్రాసు - 93

చందూర్ గారికి హృదయ పూర్వక అభినందనలు. ప్రతినెలా 'జగతి' మమ్మల్ని ఎంతగానో ఆకట్టు కుంటున్నది. 'నిమ్మతొనలు' లోని జోక్స్ మనసారా నిర్మలంగా నవ్వించేవి. చిత్ర సమీక్షలు, కొత్త పుస్తకాల రెవ్యూలు నిష్పక్షపాతం. సీరియల్ బాగుంటున్నది. 'సాహితీ సుధ' లోని పద్యాలే, కాస్త కష్టంగా ఉంటున్నాయి అర్థం చేసుకొనేందుకు. పత్రికాలోకంలో 'జగతి'కి గల స్థానం అపూర్వమైనది.

— యమ్ శ్రీనివాసరావు

ఫిరంగిపురం

చందూర్ గారికి : నమస్కార ములు. మిత్రులు యార్లగడ్డ ఆంజనే యులుగారు మాలతీ చందూర్‌కి డాక్ట రేట్ యిచ్చిన శుభవార్త చెప్పగా ఎంతో సంతోషించాను. సకలాంధ్ర లోనే గాక విదేశాలలో సైతం తెలుగు మహిళా లోకంలో తీసుకొచ్చిన జాగృతి, చైతన్యం అనన్యమైనవి. ఒక్క చేతిమీద, 37 ఏళ్ళుగా మీరు నడుపుతున్న 'జగతి' ఉన్నత విలు వలు గల చక్కటి పత్రిక.

— డి రామలింగం

హైదరాబాదు - 44

## వాణీజయరాం

మధుర గాయని వాణీజయరాంకి ఇటీవల మరోసారి జాతీయ అవార్డు లభించింది. కర్నాటక, జానపద, లలిత సంగీతాలలో నిష్ణాతురాలైన వాణీజయరాం గతంలో ఈ నేషనల్ అవార్డు రెండు సార్లు పొందారు. ఇటీవల విడుదలయిన 'స్వాతి కిరణం' చిత్రంలోని 'ఆనతి నీయరా హరా...'' అన్న కీర్తనకు అవార్డు లభించగా, తమిళ చిత్రం అపూర్వ రాగంగళ్‌లోని 'ఏజు స్వరంగ ళుక్కుళ్....' 'శంకరాభరణం'లోని 'మానస సంచరరే.... కీర్తనలు' పాడి గతంలో కూడా ఈ అవార్డు గెల్చుకున్నారు. అంటే మూడు సార్లూ శాస్త్రీయ సంగీతంలోనే అవార్డు రావడం విశేషం. 'మానస సంచరరే' బి.బి.సి. లో పాడినపుడు రికార్డిస్టులు ముగ్ధులై మరికొన్ని పాడమని కోరారట. దీన్ని బట్టి సంగీతానికి భాష ఆటంకం కాదని, సంగీతమనే భాష విశ్వంజనీనమైనదనీ మరోసారి రుజువయిందనుకోవచ్చు.

— వడ్డూరి
'జాగృతి' లో

## జాతీయ పతాకం

1921 లో మహాత్మాగాంధీ దేశ స్వాతంత్ర్యానికి నాయకత్వం వహించిన తర్వాతనే ఆయన ద్వారా భారతజాతికి మొదటి త్రివర్ణ పతాకం లభించింది. శ్రీ పింగళి వెంకయ్య ఒక క్రొత్త పతాకను తయారు చేసి గాంధీజీకి చూపించారు. ప్రగతికి సూచకంగా చర్ఖాను చిత్రించాలని గాంధీజీ సూచించారు. ఈ విధంగా త్రివర్ణపతాకం రూపొందింది. రాజ్యాంగ పరిషత్తులో చర్ఖా స్థానంలో అశోక చక్రాన్ని చిత్రించడానికి కారణం నెహ్రూ వివరిస్తూ, ఏ జెండా అయినా ఇరు వైపుల నుండి చూసినపుడు ఒకేలాగ వుండాలి కాని తిరగవేసినట్లు వుండరాదని, అది సాంప్రదాయ విరుద్ధమని అన్నారు. చక్రం అయితే ఇరు వైపుల నుండి చూసిన ఒక లాగ వుంటుంది. కనుక చర్ఖాలోని చక్రాన్ని వుంచి, కదురును తీసివేసినట్లు చెప్పారు. భారతదేశపు పురాతన సంస్కృతికి, ఈ అశోక చక్ర ప్రతీక అని వ్యాఖ్యానించారు.

— జి సుమతి
'నాస్తికమార్గం'లో

# పాతికేళ్ల నాటి పిక్చర్

## సురేష్ కంబైన్స్
## 'స్త్రీ జన్మ'

ఒక హఠాత్సంఘటన ఆధారంగా చేసుకు అల్లిన ఈ కథలో నారీ జన హృదయాన్ని పులకాంకితం చేయగల సన్నివేశాలు సమృద్ధిగా వున్నాయి. ప్రేక్షకాభిరుచి కోసమనే ప్రలోభంలో ప్రవేశ పెట్టిన అల్లరి చిల్లర దృశ్యాలు కొన్ని లేకపోలేదు. అయితే అవి అడ్డు పడకుండా, ప్రధాన యితివృత్తాన్ని ఎంతో ప్రతిభావంతంగా మలిచారు దర్శకులు కెయస్ ప్రకాశరావు. ఆయన కౌశలము, ముద్రా చివరంటా కనిపిస్తాయి. కళ్యాణి తండ్రికి (నాగయ్య) ఈ లోకమంతా పగిలిన కళ్ళద్దాలలోనుంచి కనిపించటం. నవ కాళీ దురంతాలు విన్నమీదట హతాశురాలైన కళ్యాణిలో (కృష్ణ కుమారి), ఆమె కనులలో జీవితేచ్ఛ చిగురించటం, 'నీడలకు రూపాలు కల్పిస్తారు 'అని మధు (కాంతారావు) సుశీలతో (అంజలీదేవి) అనటం, 'ఈ భయంకర సత్యం నాకెందుకు చెప్పావమ్మా' అని సుశీల భోరున ఏడవటం - యిటువంటి రసోద్దీపిత సన్నివేశాలు డైరక్టరు ప్రకాశరావు ఒక్కరే సృష్టించగలరు. అయితే, ఆయనసైతం బాక్సాఫీసు కోసం కావచ్చు, 'ఏదో ఏదో అవుతున్నది.... అని అశ్లీలం స్ఫురించేపాట పెట్టారు. పద్మనాభం గీతాంజలి పార్సుని మెచ్చుకున్నంతగా, విజయనిర్మల కృష్ణల పల్లీలు హర్షించరేమో ప్రేక్షకులు.... రెండు నెలల బోనసేమిటి, నాలుగు నెలల బోనస్ యివ్వండి ; తమ్ముడూ అయిదు వందలు కాదు, వెయ్యి రూపాయిలు దగ్గిర వుంచుకో నీ సొదరు ఖర్చుకి' - అనే కథా నాయకుడు (యన్‌టి రామారావు) మంగళాపురం పెళ్ళికి వెళ్ళి, ఫ్రెండ్స్ వత్తిడి వల్ల మొదటిసారిగా డ్రింక్ రుచి చూసి, ఆ మైకంలో నర్తకిపై మనసు నిలిపి' ఆమె గది అనుకొని వెళ్ళి, 'కళ్యాణి'ని బలి పశువుగా చేస్తాడు ; ఆమె గర్భవతి అవుతుంది. ప్రారంభాన జరిగిన చీకటి తప్పు యిది - అరుపులూ అర్భాటాలూతో దోష నిర్ణయం జరుగుతుంది. అక్కడక్కడ డాక్టరుగా కనిపించే డి. రామానాయుడు ఈ చిత్రానికి నిర్మాత.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - అక్టోబరు 1967

## పులిట్జర్‌లు

జర్నలిజంలోను, కళలలోను విశేష ప్రతిభ కనబరచిన వారికై అమెరికాలో అంత్యంత ప్రతిష్ఠాత్మకమైన పులిట్జర్ అవార్డులను ఇటీవల ప్రకటించారు. కాల్పనికేతర సాహిత్యంలో ఇచ్చే 'జనరల్ నాన్ ఫిక్షన్' అవార్డు ఇంధన విషయాల నిపుణుడు, చరిత్రకారుడు అయిన డేనియల్ ఎర్గిన్ వ్రాసిన 'ది ప్రయిజ్: ది ఎపిక్ క్వెస్ట్ ఫర్ ఆయిల్, మనీ అండ్ పవర్' అనే పుస్తకానికి లభించింది. ఒక ప్రధాన అంతర్జాతీయ వనరుగా ఆయిల్‌కి గల ప్రాముఖ్యతను ఈపుస్తకం వివరిస్తుంది.... 'ఫార్చ్యునేట్ సన్: ది హీలింగ్ ఆఫ్ ఎ వియత్నాం వెట్, అనే లూయిస్ బి. పుల్లర్ జూనియర్ రచనకు 'బయాగ్రఫీ' బహుమతి లభించింది. రెండవ ప్రపంచ యుద్ధంలోను, కొరియన్ యుద్ధంలోను వీరోచితంగా పోరాడిన జనరల్ లూయిస్ బి. పుల్లర్ కుమారుడైన పుల్లర్ జూనియర్ 1968లో వియత్నాంలో ఒక మందు పాతర పేలుడులో రెండు కాళ్లూ పోగొట్టుకున్నాడు.... 'మాస్ - 1' 'మాస్ - 2' అనే కామిక్ పుస్తకాలు రాసిన ఆర్ట్ స్పీజిల్‌మన్‌కి స్పెషల్ పులిట్జర్ అవార్డు ప్రకటించారు. తన కామిక్‌లో స్పీజిల్‌మన్ యూదులను ఎలుకలగాను, నాజీలను పిల్లులుగాను చిత్రించారు. రచయిత్రి జేన్ స్మిలి రాసిన 'ఎ థవ్‌జండ్ ఏకర్స్' అనే నవలకు కాల్పనిక సాహిత్యంలో (ఫిక్షన్) ఇచ్చే పులిట్జర్ బహుమతి లభించింది. ఈ నవలలో స్మిలీ అయోవాలోని ఒక వ్యవసాయ కుటుంబం నేపథ్యంలో కింగ్ లీర్ కథకు పునః సృష్టి చేశారు.... కాగా, జేమ్స్ టేట్ అనే కవి అందించిన 'సెలెక్టెడ్ పోయమ్స్'కి పులిట్జర్ పొయిట్రీ బహుమతి లభించింది. 'ది కెంటకీ సైకిల్' అనే ఏడు గంటల రంగస్థల కార్యక్రమాన్ని రచించిన రాబర్ట్ షెంకన్‌కి కూడా పులిట్జర్ బహుమతిని ప్రకటించారు. 20 మంది నటించే ఈ రంగస్థల కార్యక్రమం కెంటకీకి చెందిన 'కంబర్లాండ్ ప్లాటో' 200 ఏళ్ల చరిత్రను ప్రతిబింబిస్తుంది.... 'ది ఫేట్ ఆఫ్

లిబర్టీ : అబ్రహాం లింకన్ అండ్ సివిల్ లిబర్టీస్' అనే పుస్తకం వ్రాసిన మార్క్ ఇ. నీలీ జూనియర్ 'చరిత్ర' (హిస్టరీ) రచనకిచ్చే పులిట్జర్ అవారును పొందారు. 'సివిల్ వార్' రోజులలో 'హెబియస్ కార్పస్ రిట్ సస్పెన్షన్'కి సంబంధించిన 10, 000 కి పైగా కేసులని ఈ పుస్తకం పరిశీలిస్తుంది.... ఇక జర్నలిజం అవార్డులలో.... టామ్ నడ్సన్ వ్రాసిన 'శాక్రమెంటో బీ' కి పబ్లిక్ సర్వీస్ అవార్డు లభించింది, కాలిఫోర్నియాలోని సీరా నెవాడా పర్వత శ్రేణులకు ఏర్పడిన పర్యావరణ సంబంధిత విపత్తును ఈ పుస్తకం వివరిస్తుంది.... టెక్సాస్ లా ఎన్ఫోర్స్‌మెంట్ అధికారుల వల్ల జరిగిన పౌరహక్కుల ఉల్లంఘనపై వ్యాస పరంపర వెలువరించిన 'డల్లాస్ మార్నింగ్ న్యూస్' పత్రిక జర్నలిస్టులైన లారేన్ఆడమ్స్, డాన్ మాలోన్‌లకు పరిశోధనాత్మక జర్నలిజంలో పులిట్జర్ అవార్డు లభించింది. 'స్పాట్ న్యూస్ రిపోర్టింగ్'కి ఇచ్చే 'పులిట్జర్'ని న్యూయార్కులోని 'న్యూస్‌డే' పత్రిక సిబ్బంది పొందారు. 1991లో అయిదుగురి మృతికి, 200 మంది గాయపడడానికి దారి తీసిన న్యూయార్కు సిటీ సబ్‌వే రైలు ప్రమాదం తాలూకు 'కవరేజ్'కి గాను ఈ అవార్డు లభించింది. పర్షియన్ గల్ఫ్ యుద్ధం తదనంతర పరిస్థితిపై చేసిన 'ఇంటర్నేషనల్ రిపోర్టింగ్'కి గాను న్యూస్ డే'కి చెందిన పాట్రిక్ జె. స్లోయాన్‌కి 'పులిట్జర్' ప్రకటించారు. హబుల్ అంతరిక్ష టెలిస్కోపులో ఏర్పడిన లోపం గురించి, అమెరికా అంతరిక్ష కార్యక్రమంలోని నిర్వహణా సమస్యల గురించి, చర్చించిన రాబర్ట్ ఎన్. కేపర్స్, ఎరిక్ లిప్టన్‌ల నాలుగు భాగాల రచన 'ది హార్ట్ ఫోర్ట్ కౌరంట్'కి 'ఎక్స్‌ప్లనేటరీ జర్నలిజం'లో పులిట్జర్ అవార్డు ప్రకటించారు. 1940 ప్రాంతంలో అలబామాలోని బర్మింగ్‌హామ్‌లో తమ ఇంట్లో హౌస్ కీపర్‌గా పని చేసిన ఒక నల్లజాతి వ్యక్తితో తన మైత్రిని గుర్తు చేసుకునే హావెల్ రయిన్స్ రచనకు (ది న్యూయార్క్ టైమ్స్) 'ఫీచర్ రైటింగ్'లో పులిట్జర్ ఇచ్చారు.

(అమెరికా సమాచార శాఖ

## విశాఖ ఉక్కు

విశాఖపట్నం ఉక్కు కర్మాగారం రెండవ దశ నిర్మాణం కూడ పూర్తయిన దృష్ట్యా, అగస్టులో ఈ కర్మాగారాన్ని జాతికి అంకితం చేశారు ప్రధాన మంత్రి పివి నరసింహారావు. దేశంలో ఉక్కు పరిస్థితిని మరింత పటిష్ఠ పరచడానికి 20 సంవత్సరాల భవిష్యత్ ప్రణాళికను ఒక దాన్ని రూపొందిస్తున్నట్లు తెలుస్తోంది. ఇండియన్ ఐరన్ అండ్ స్టీలు కంపెనీ ఐ.ఐ.ఎస్.సి.ఓ. ఆధునికీకరణ మాత్రమే కాక, సంయుక్త రంగంలో చేపట్టడం జరుగుతుంది. నెయిల్ కొకింగ్ కోల్‌న్ను

సం॥ కి మూడు మిలియన్ టన్నుల బొ॥ న ఐదు సంవత్సరాల పాటు దిగుమతి చేసుకోడానికి నిర్ణయించవచ్చు. (రూర్కెలా ఉక్కు కర్మాగారం అధునికీకరణ రూ. 3,954 కోట్ల దీనిలో విదేశీ మారక ద్రవ్యం రూ. 714 కోట్లు అంచనా వ్యయంతో ఈ నెలా ఖరుకు మొదలై, డిసెంబరు 1995 నాటికి పూర్తివుతుంది) భవిష్యత్తులో ఇనుము - ఉక్కు కర్మాగారాలను కేంద్ర ప్రభుత్వ రంగంలో కాక, రాష్ట్ర ప్రభుత్వము-ప్రైవేటురంగాలతో కూడిన సంయుక్త రంగంలోనే నిర్మించడం జరుగుతుందని అంటున్నారు. అయితే ఇట్టి రంగాల అధునికీ కరణకు మాత్రం ప్రభుత్వ రంగం తోడ్పడు తుంది. పూర్తిగా ఎగుమతులకు నిర్దేశించిన కుద్రేముఖ్ ఉక్కు కర్మాగారం 1991-92 సం॥ లో ఎగుమతుల ద్వారా గత సం॥ కన్నా రూ. 163.83 కోట్లు అధికంగా, రూ. 392.81 కోట్ల విదేశీ మారక ద్రవ్యాన్ని ఆర్జించింది.

(ప్రెస్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో

## నిరాధారులు

మహారాష్ట్రలోని థానే జిల్లా దహానూ తాలూకాలో సముద్రం ఒడ్డు పై బొంబయి ఉపనగరీయ విద్యుత్ సేవా (బి. ఎస్. ఇ. ఎస్.) వారు నిర్మించ తలపెట్టిన 500 మెగావాట్ల థర్మల్ విద్యుత్కేంద్రం ఆ చుట్టు ప్రక్కల నివసించే, చేపలు పట్టి జీవనం వెళ్లదీస్తున్న వారి మనుగడకు, పర్యావరణానికి ఎంతో హాని కల్గిస్తుంది. గుజరాత్ నుండి కొన్ని వందల ఏళ్ల క్రితమే మాఖీమత్‌నా గిరిజనులు ఈ ప్రదేశానికి తరలి వచ్చి స్థిరనివాస మేర్పరచుకొన్నారు. వారు వర్షాకాలంలోతమ చిన్న చిన్న కమతాలలో ఆహారపు పంటలు పండించుకొంటారు. సముద్రపు చేపలు పడతారు. వారు సముద్రంలోకి దూరం వెళ్లరు. అలలు పెద్దవిగా వచ్చినపుడు వలలు వేసి సముద్రపు ఒడ్డునే చేపలు పడతారు. అధికారులు తమ భూములను ఆక్రమించడానికి ప్రయత్నిస్తున్నారని, తమ భూములను వారికి ఇవ్వకూడదని గిరిజనులు నిశ్చయించుకొన్నారు. ఈ థర్మల్ విద్యుత్కేంద్రం వలన భూమి, నీరు కలుషితమవుతాయి. దీని సామర్థ్యాన్ని 2000 మెగావాట్లకు పెంచే ప్రతిపాదన కూడా ఉన్నది. ప్రతి రోజు 4080 టన్నుల బొగ్గు దహింపబడుతుంది. 1300 టన్నుల బూడిద రోజూ గాలిలో కలుస్తుంది. అందులో సీసం, నికెల్, కాడ్మియం లాంటి విషపదార్థాలుంటాయి. ఈ కేంద్రం సముద్రానికి 500 మీటర్ల దూరం లోపలే నిర్మింపబడుతోంది. ట్రక్కుల ద్వారా మట్టిని తీసుకువచ్చి సముద్రాన్ని దూరంగా నెట్టే ప్రయత్నం చేస్తున్నారు. సముద్రంలోకి చేరే కలుషిత ద్రవపదార్థాలు జలప్రాణులకు, పర్యావరణానికి హాని కలిగిస్తాయి. ఎన్ని కష్టనష్టాలకు ఓర్చి అయినా, తమ ఆస్తిని కాపాడుకొంటామని మోటాపాడా గ్రామ ప్రజలు, గిరిజనులు పట్టుదలగా ఉన్నారు. ఎందుకొరకంటే చిన్న చిన్న కమతాలపై సంయుక్త కుటుంబాలు ఆధారపడి ఉన్నాయి. నష్టపరిహారం డబ్బు కాదు వారికి కావల్సినది... చాలా కాలం ఇక్కడ చేపలు పట్టేవారు తమకు అనుసూచిత జాతుల (గిరిజనుల) స్థాయిని కల్పించమని కోరుచున్నారు. ఛత్రపతి సింగ్ తన పుస్తకం 'కామన్ ప్రాపర్టీ ఎండ్ కామన్ పావర్టీలో, పేదల, గిరిజనుల ఆస్తిని సహజ వనరులను ఎలా లాక్కొంటున్నదీ, వారికి అనుకూలమైన వసతులను ఎలా కల్పించలేక పోతున్నదీ విశదీకరించారు. చివరికి వారు దొంగలుగానో, బిచ్చగాళ్లగానో మారేలా చేస్తున్నది వ్యవస్థ. నేరం వారిది కాదు - సమాజానిది - ప్రభుత్వానిది అంటా రాయన. నిరాధారులయిన మత్స్యకారులను బలవంతమైన ప్రైవేటుకంపెనీలు, వారికి వత్తాసు పలికే ప్రభుత్వ అధికారుల నుంచి ఎలా సంరక్షిస్తారో చూడవలసి వుంది.

(సర్వోదయా ప్రెస్ సర్వీస్

సంక్షిప్త భాగాలు

# 'నా రాట్న చక్రం'

## తల్లాప్రగడ ప్రకాశరాయుడు

గాంధీ గారికి సత్యాగ్రహోద్యమం, నిర్మాణ కార్యక్రమం రెండు నేత్రాల వంటివి ; రెండూ పరస్పర ఆశ్రితాలు. రాజకీయ పదవులు ఆశించకుండా, గాంధీజమ్‌కి కట్టుబడి, నిర్మాణ కార్యక్రమానికి అంకితమైన మహానుభావులలో ప్రకాశరాయడు గారొకరు.... వారి జీవిత గాథలోని సంక్షిప్త భాగాలివి.

బోర్డు కార్యదర్శిగా నుండిన శ్రీ రామానంద్ గారితో కలిసి సంస్థ కేంద్రాలను పర్యవేక్షించే పని నాకు అప్పజెప్పబడ్డది. ఆ పర్యటనల యొక్క తబ్సీళ్లు యిప్పటికీ నా కండ్లకు కట్టినట్లున్నాయి. ఒకరిద్దరు ముఖ్య కార్య కర్తల వల్ల (ఒక్కరే అను కుంటాను) స్మారక నిధికి ఆర్థికంగా అప్రతిష్ట వాటిల్లిన సందర్భంలో దానిని సరిదిద్దడానికి మేము చేసిన ప్రయత్నాలు విఫలమైనాయి. ఆ కార్య కర్త దివాలా ప్రకటించగా సర్వం వ్యర్థమయింది. గత్యంతరంలేక ఆ మనిషిని వదిలి వేయక తప్పింది కాదు.... ఆ కాలంలో నిధి పక్షాన కొన్ని పెద్దపుస్తకాల-గాంధి సాహిత్య (తెలుగు అనువాదాలు) ప్రచురణ — అయింది. అందు రెండు పెద్ద పుస్త కాలు (గాంధి అహింసా సిద్ధాంతాన్ని గూర్చినవి) నాలుగు భాగాలుగాను, బేసిక్ విద్యను గూర్చినవి రెండు సంపుటాలుగా అనువాదాలు నేను చేసియుంటిని.... విజయవాడ రైలు స్టేషన్ వెనుక వైపు నుండిన కొండను స్మారక నిధికి సంపాదించి పెట్టారు శ్రీ కె. యల్ రావు గారు. దానిపైన కొన్ని వృక్షాలను పెంచి వాసయోగ్యం చేశారు. కొండ కొనను గాంధి పేరిట ఒక స్తూపాన్ని నిర్మించి ఆ ప్రదేశానికి 'గాంధీ పర్వతం' అని పేరుపెట్టారు. రెండు మూడు భవనాలను నిర్మించి ఒక పెద్ద పుస్తకాలయాన్ని నెలకొల్పారు. దానిని ప్రైవేట్ సంస్థగా నుంచకుండ మొత్తాన్ని ప్రజల పరం చేశారు 'గాంధిపర్వత' నిర్మాణంతో నాకు

సంబంధం లేకపోయినా, నేను స్టేట్ బోర్డు మెంబరుగా నున్నపుడు జరిగిన పనిగా దీని నిక్కడ పొందు పరుస్తున్నాను.... నేను స్వీకరించి చేసిన పని ముఖ్యంగా నిధి క్రింద నుండిన 14 కేంద్రాల పనిని గూర్చిన పర్యవేక్షణయే. 1963లో కేంద్రాల (ఆశ్రమాల) కు తిరిగి. వాటి స్థితి గతులను గూర్చి, సేవకులు పాటించ వలసిన నియమ నిష్ఠలను గూర్చి, తాత్కాలికంగా యేర్పడిన సబ్ కమిటీ సమావేశ కర్తగా నేనొక నివేదిక తయారు చేసి, నిధి వారికి సమర్పించాను. నా దృష్టిలో అదొక విలువ గల విషయం. ముద్రింప బడియున్న ఆ రిపోర్టు యిప్పుడు కూడా నా వద్ద నున్నది. కేంద్రాల పర్యవేక్షకుడుగా నేనుండిన కాలంలోనే శ్రీ జి. యస్. మేల్కొటే ('నిధి' ఆంధ్రశాఖ అధ్యక్షులు) అధ్యక్షతను మహబూబ్ నగర్‌లో నిధి పక్షాన చాలామంది హాజరైన ఒక పెద్ద కాన్ఫరెన్స్ జరిగింది. ఆనంద నికేతనాశ్రమంలో నెలకొల్ప బడ్డ 'నిధి' తాలూకు గ్రామ సేవా కేంద్ర పర్యవేక్షణను (తత్పూర్వం) అది మా హరిజన ఆశ్రమానికి నెలవై యుండెను కనుక) నేను ప్రత్యేకంగా పని పెట్టుకొని నా రాజమంద్రి నివాసం నుండి విధిగా వారాని కొక సారి వెళ్లి, గ్రామ సేవకుల పనిపాటలను పరిశీలించే వాడను. అక్కడ గ్రామసేవకులు ముగ్గురిలో నా యందెక్కువ ప్రేమాభిమానాలుగల శ్రీ సోమలంక శేషయ్య ఒకడు. ప్రత్యేకించి అతని పేరు ఇక్కడ ఎందుకు ఎత్తుకున్నానంటే. అతనికి నేను అప్పగించిన పనులు రెండు : ఆశ్రమానికి కొద్ది ఫర్లాంగుల దూరములో నున్న హరిజన పల్లె లోని కూలి పని. వాండ్రకు రాత్రి పాఠశాల నడుపటం ఒక పని.

ఆశ్రమంలో కంపోస్టు తయారుకు పరిసర ప్రాంతాలలో దొరికే పశువుల పేడ పోగుచేసుకొనివచ్చి నిలవ చేయడం రెండవ పని నా కోరిక మేరకు సరించి రెండు పనులూ పూర్తిగా నెరవేర్చాడు మా పొట్టి శేషయ్య. పొట్టి వాడేకాని చురుకైనవాడు. శేషయ్యను గూర్చి మరొక్క విషయం : 10, 14 ఏండ్ల వయస్సప్పుడే శేషయ్య బడి చదువు మాని వేశాడు. ఎందుకు ? గాంధీ యుద్ధములో చేరడానికి. అతనిది మాధవరం అనే [illegible] గ్రామం. బడికి పంపడానికి తండ్రి, సోదరులు కఠిన ప్రయత్నాలు చేశారు. తిట్టారు, గ్రామస్తుల చేత తిట్టించారు. దెబ్బల శిక్ష వేశారు. తల గొరిగించి, సుద్దబొట్లు పెట్టి గాడిదపై నెక్కించి వీధుల్లో త్రిప్పి అవమానించారు. దేనికీ అతడు లొంగలేదు. ప్రహ్లాదుడని అతనికి నేను పేరు పెట్టాను. ఆ ప్రహ్లాదుడు వయస్సు వచ్చిన తరువాత 'నిధి' గ్రామ సేవా కేంద్ర కార్యకర్త అయినాడు. ఆదర్శపురుషుడని చెప్పి అతనిని నేను ఆహ్వానించి గ్రామ సేవకుడుగా తీసుకొని వచ్చాను. శ్రీ శేషయ్య ఎంత వినయశీలుడో అంతగా సత్యాగ్రహ వీరుడు....

పూర్వపు 'ఆనందనికేతన' హరిజనా శ్రమ స్థలంలో 'స్మారక నిధి' గ్రామ సేవా కేంద్రం పని చేస్తున్న కాలం లోనే 'గాంధీ గురుకుల విద్యాశ్రమం' అనే పేరుతో ఒక గురుకుల పాఠశాల తెరువ బడి, కొద్ది సంవత్సరాల పాటు నడిచింది. శ్రీ గద్దే రామమూర్తిగారు దానిని స్థాపించి నిర్వహించారు. ఆడ, మగ విద్యార్థులు భోజనానికి యిండ్లకు వెళ్ళి రావడం తప్ప రోజంతా విద్యాలయంలోనే ఉండి పోయే వారు. మగపిల్లలు రాత్రికి అన్నం తెచ్చుకొని విద్యాలయంలోనే నిద్రించేవారు. రామమూర్తిగారువాలా యేండ్లు ఏలూరులో V.L W. పని చేసి అది తనకు భర్జించక, ఈ విద్యా లయాన్నిక్కడ నెలకొల్పారు. గాంధి సిద్ధాంతాల కనుగుణంగా శ్రద్ధతో నడుపబడిన సంస్థ అది. ఇంటి స్థలం పోగా మిగత భూమిలో అరటి తోట. భూమి చుట్టూ కొబ్బరి మొక్కలు వేసి పెంచి, తోట ఆదాయంతో భూగర్భ జల సమృద్ధిని ('బోరింగు') కల్పించి, పాతదై యుండిన యింటికప్పును బాగు చేయించి, సర్వవిదాలా పాటు పడి పేరు ప్రతిష్ఠలను నిలిపినవారు శ్రీ గద్దే రామమూర్తిగారు. స్మారకనిధి గ్రామసేవా కేంద్రం, తాను నడిపిన గురుకుల విద్యాశ్రమం – రెండూ యిపుడు రూపుమాసినా ఆ స్థలం, తోట, యిల్లూ అన్యాక్రాంతం కాకుండా అక్కడ ఒక పనిమనిషిని పెట్టి, వాటి మర్యాదను నిలుపుతున్నారు. ఖాళీగా నున్న ఆ స్థలంలో జిల్లా పరిషత్ హైస్కూలు స్థాపింప జేయడానికి ఆ గ్రామస్తులు కృషి చేస్తున్నారు....

ఇట్లా గాంధీ స్మారకనిధి పని ప్రచారకార్యం ముగిసిన పిదప రెండేండ్లపాటు మా అమ్మాయి (కుమార్తె) యూనివర్సిటీ చదువు

కోసం విశాఖపట్నంలో గడిపి, అట నుండి వచ్చేసి, అబ్బాయి రాజారాం వద్ద ఇక్కడ హైదరాబాద్‌లో స్థిర పడ్డాను.

## 11

ఇక నేముందు వ్రాసుకునేది? వివిధ ప్రజాసంస్థల పేర నాకు కల్పింపబడ్డ సేవాభాగ్యాన్ని యింత వరకు వ్రాతలో పెట్టాను. వృద్ధాప్యపు మఱపువల్ల అక్కడి దిక్కడ, యిక్కడి దక్కడ పెట్టియుంటాను. అయినా మళ్ళీ చదువుకుంటే, ఈ కథ నాకంత అసభ్యంగా కనబడటంలేదు. ఇదంతా ఆరంభంలో మా అమ్మాయి పెట్టిన పేటన యని పైన ఒకసారి చెప్పుకున్నట్లున్నాను. తీరా కలం కాగితం చేతబుచ్చుకున్న తరువాత ముఖ్యంగా ఈ రెండో భాగంలోని పాత విషయాలు జ్ఞప్తికి తెచ్చుకొని రాయడం నాకూ బాగానేవుంది. ఏలనంటే ఏ సర్కారు నౌకరికి పోకుండా, ఈ చిన్న నా బ్రతుకును గాంధీ ఉద్యమానికీ, దాని ప్రచారానికీ అంకితం చేసుకొన్న విశిష్టత నాకు చాలును. దానిని రాజకీయాల లోనికి జారిపోనీయ కుండా నిర్మాణ కార్యక్రమమునకే నన్నది నాకున్న తృప్తి దేశ స్వాతంత్ర్యం కోసం త్యాగాలు చేసిన నీ వంటి వాళ్ళకు యీయ వలసినంత రికాగ్నిషన్ ప్రభుత్వం ఈయలేదని చెప్పి కొందరు మిత్రులు లేనిపోని విచారం వెలిబుచ్చుతూంటారు - నాకా విచారం లేదు.

నేను పుస్తక రూపంలో ఏది వ్రాసుకున్నా, ఏది చెప్పుకున్నా దానిని ధర్మప్రచార మనుకోవడం నాకు ప్రియం. గాంధీ యుద్యమ మనే దొకటి వచ్చి ఈ జీవితానికి కొంచెం పదును పెట్టింది కనుక, దీనిని గాంధీ ధర్మప్రచార మనడం యింకా దగ్గర మాట. నేను 1931 లో వెల్లూరు జైలులో నున్నప్పుడు శ్రీ మల్లాది యజ్ఞనారాయణ (సత్యాగ్రహ ఖైదీ) గారి వద్ద నాకొక యింగ్లీషు పుస్తకం దొరికింది. అది 'Teaching of Jesus' అనే టాల్‌స్టాయి పుస్తకం. అది యొక ఆధ్యాత్మిక ధనాగారంగా తోచి దానిని తెలుగులోనికి అనువదించాను. దానిని చదువుకోగా అందలి నా కుంటి తెలుగుతో నాకు తృప్తి కలగలేదు. దానిని పట్టి పట్టి దిద్ది దిద్ది ఒక దారిని బెట్టి, మిత్రుడు సత్యాగ్రహ ఖైదీ శ్రీ సోమరాజుగారి డబ్బు సహాయంతో అచ్చు వేయించాను. 52 చిన్న అధ్యాయాలుగ 100 పేజీల పుస్తకం అది. మొదటిసారి జైలు నుండి రాగానే ఉద్యమావేశంతో నిండి 'నవయుగ సందేశం' అనే మకుటం గల కొన్ని పేజీల చిన్న పుస్తకం వ్రాశాను. భీమవరం ముద్రాపకు లొకరు సర్కారు భయం లేకుండా ముద్రించి వేయి ప్రతులు నా పరం చేశారు. అవి అనేకుల చేతిలో పడినా, అది సర్కారు ఆజ్ఞకు గురి కాలేదు. నా ఆశయం మాత్రం నెరవేరింది. ఇక తరువాతి

పుస్తకాల తేదీలు సందర్భాలు నాకు జ్ఞాపకం లేవు.

'వైష్ణవ జనతో' .... అనే నర్సీ మెహతా కీర్తన గాంధికి కల్పవృక్షం. దానితో గ్రామ సేవకుల మనస్సులు హమేషా నిండి యుండాలి. "God is Truth" అంతకు మించిన దేమున్నది ?

## 12

ఇది నా కథలో ముఖ్యమగు చివరి అధ్యాయము దీనిని వివిధ శీర్షికలుగా విభజించుకుంటాను. నా మత మేమిట నేది యిందు మొదటిది.

1982 - 83 లో "Christian Institute for the study of Religion and Society', కి సంబంధించిన శ్రీ Richard W. Tailor బెంగుళూరు నుండి నాకు ఉత్తరాలు వ్రాస్తుండే వారు. వాటిల్లోవారు నన్ను ముఖ్యంగా కోరింది. 'ఆంధ్ర బ్రహ్మ సాధనాశ్రమ చరిత్ర, వ్రాసి పంపాను. అందులో నామతం ఏమిటో కొంచెంగా ఆయనకు పరిచయంచేస్తూ ఈ క్రింది మాటలు వ్రాశాను. "ఇది మీకు నా మనవి. నా 17 వ యేట నుండి నామతాని కొక పెట్టుడు పేరు లేదు. దాని నొక 'విశ్వ ధర్మం' అనవచ్చు. అయితే అందు విశ్వభావన ప్రధానమైన, నేను భారతీయుడననీ, సనాతన హిందూ

వంశజుడనీ చెప్పుకునే ప్రత్యేకత లేక పోలేదు. దేశం లోపలి మతశాఖలన్నీ సర్వాంగీణమగు భారత సంస్కృతి యనే మహావృక్షం యొక్క చిన్న కొమ్మలు, రెమ్మలు. ఆ సంస్కృతి యొక్క బిడ్డను కావడం నా అదృష్టం. అంతేకాదు – హేతుబద్ధుడైన పరిశుద్ధ జ్ఞానమూర్తియగు సోక్రటీసు పాద రేణువును నేను. చారిత్రక యుగంలో నెమ్మది చెడి, కలత నొందు చుండిన ప్రపంచానికి అహింసా సందేశాన్ని ప్రసాదించిన బుద్ధ, మహావీరులు నా గురు సత్తములు; ప్రపంచ బాధ వేదనలను స్వయంగా అనుభవించి అమరుడై, మానవులకు శాంతిబోధ గావించిన క్రీస్తు యొక్క అనుయా యిగా బ్రతికిపోవాలని నా ఆకాంక్ష. మానవశ్రేణి కంతకూ పరమాత్మ ఒక్కడనీ, మానవాళి కంతకూ ముక్తి మార్గం కూడా ఒక్కటే యనీ గట్టిగా నమ్మి చరించిన పైగంబరు మహ మ్మదు నాకు హమేషా వంద్యుడు. పవిత్రుడు, పుణ్యశీలుడు అగు జొరాస్టరు కూడా నాకు దైవ సమానుడు. 'The Beloved' అగు భగవంతుని హృదయాంతర వర్తిగ చేసుకొని, ఆ యాప్తుని చేరే మార్గం మన లోపలనే యున్నదన్న సింధు సూఫీ యోగులు నాకు ప్రియతములు .... పూజా గృహం చొచ్చి, తలుపులు మూసుకొని, జగత్ స్వామియొక్క యేకాంతసేవలో నిమగ్నుడవు కమ్మ నిన క్వేకర్ మహర్షి నా వాడు. అంత ర్ముఖుడవై దైవాన్ని అర్చిస్తూ, బయట కనబడే ఆయన భక్తకోటితో ఏకం కమ్మనే 'బహాయి' ధర్మసాధకుడు నా సర్వస్వం. ధర్మ దివ్వెను చేతబూని ప్రపంచ మానవులకు దారి చూపిన నానక్, కబీరు, తుకారాం మున్నగు భక్త శిఖామణు లందరు నాకు దారి దీపాలు. ఇదే నా మతమని చెప్పి మీ వాడనగు నేను మీతో మనవి చేస్తున్నాను. 'Life Divine' అనేది యిహపరాలలో సర్వత్ర ఒకటే. మీ యభిప్రాయం కూడా యిదే నను కుంటాను. మిమ్మొక చిన్న క్రీస్తుగా నేను భావిస్తాను. నా దృష్టిలో గీతా శాస్త్రం, కొండ మీది క్రీస్తు ధర్మ ప్రసంగం రెండూ వస్తుతః ఒక్కటే కాకుంటే న్యూయార్కు బిషప్ J. H. Holmes గాంధీ యుద్యమ ప్రారంభం (1921) లోనే తన చర్చిలో ధర్మ ప్రసంగం చేస్తూ When I think of Gandhi, I think of Christ Jesus' అని యెట్లనగలుగుతాడు? గాంధీ జీససులు ప్రతి విషయంలోను ఒకటి కాక పోవచ్చు. ప్రపంచ మతాల పేర్లు, వాటి దేశాలు వేరైనా నిజానికి మత ధర్మ మనేది ఒక్కటే. మానవు లందరూ ఆత్మ సంభవులే. అట్లని తెలుసుకోవాలి గాని అందరు జగన్మాత బిడ్డలే. తెలుసుకున్నవారికి, ఒక మహాకవి చెప్పినట్లు ఇదొక, ఆనందం, స్వేచ్ఛ, విజయం – "Joy, Glory, Freedom, Victory" మీకు తెలియని విషయం లేదు. ఈ మాటలు వ్రాసేది మీ కోసం కాదు.

ఇది నా జ్ఞాపకార్థం – నాలో నాకొక హెచ్చరిక. నన్ను నేను తెలుసుకొని, నేను నేనై బ్రతకడానికి, లోపలి నుండి ఉబికుబికి వచ్చే ఆరాటం. నా శరీరాన్ని, మనసును పరిశుద్ధ పరచు కొందును గాక! నా ప్రతి అవయవం మీదను నీ స్పర్శ తగులు చుండు గాక!' యని భగవంతుని కొక భక్త కవి ప్రార్థన. నాది కూడా అదే!

స్వర్గధామం లోని మీ తండ్రి పరిపూర్ణుడయి యున్నట్లు మీరును పరిపూర్ణులు కండు. నీ పొరుగు వారిని నీ వలె ప్రేమించు. నిన్ను దూషించే వారికి మంచి చేసి పంపించుమని ఏసు ప్రభువు సందేశం భగవంతుని మాటగా మహమ్మదు యిట్లా సాక్ష్యమిస్తున్నాడు. "I was a hidden treasure; but I would fain be known. So I created man." అని. ఎందుకు? మానవుడు తన్ను తాను తెలుసు కొంటూ, తనను తదితరులను సంస్క రించడానికే జన్మించాడు. ఇది స్వప్రయత్నంతో జరగవలెనన్నది. దైవేచ్ఛ, ఆయన కృప, నిరంతర త్యాగంలో నున్న ఆనందం మానవుని కీయబడిన వరం. త్యాగమంటే బ్రతికుండే కాలమంతా జీవ ప్రపంచ క్షేమం కోసం, శ్రేయం కోసం చేయ వలసిన పని. మనిషిలోని జంతుతత్వం మానవతగా మారాలి. మన ప్రతి చిన్న పనీ, సేవారూపం తాల్చాలి. అది హేతుజ్ఞానాన్ని, అంతరాత్మను తృప్తి పరచాలి. జీవిత క్రియలన్నీ సామాజిక శ్రేయోదాయకాలు కావాలి. సంస్కరణ యొక్క విశాలారమిదే. ఇందువల్ల మతం, సంఘం, రాజ కీయాలు పరిశుద్ధ మవుతాయి. ఒక్క మాటలో, పిడచ గట్టుకొని పోయిన పాత సంస్థలకు కొత్త విలువలు రావాలి. మానవాత్మ స్వేచ్ఛతో గూడిన సుఖంకోసం ఆరటిస్తోంది. మత దురభిమానాలు, పరస్పర రోష ద్వేషాలు సాంఘిక దాస్యాలు అంత రించాలి. స్వార్థంలో దురాశ, దురాశలో పాపం, పాపచింతనలో మృత్యువు ఉన్నదని జాగ్రత్త చెపు తున్నారు ఋషులు, సంఘ సంస్కరణ యీ జాగ్రతతో ప్రారంభం కావాలి. 'అసతోమా సద్గమయ - తమసోమా జ్యోతిర్గమయ - మృత్యోర్మా అమృ తం గమయ' – లోకశాంతికై వ్యక్తి పరం, సంఘపరమైన ప్రార్థన యిది.

✠ ✠ ✠

స్వాతంత్రోద్యమంలో Who is Who అనే శీర్షికతో ఉన్మానియా విశ్వవిద్యాలయ చరిత్ర ప్రొఫెసర్ సరోజిని రెగాని M. A., Ph.D. గారు యిండియా స్వాతంత్ర్య సమ రోద్యమంలో నా అనుభవాలను చెప్పమని, నేనిచ్చిన జవాబును రెండేండ్ల క్రితం tape record చేయించుకున్నారు. ఆమెగారు నాకు బంపిన 21 ప్రశ్నలకు నా జవాబులే క్లుప్తపరిచి ఇక్కడ పేర్కొంటున్నాను:

ప్రశ్న: 3. ఆనాటి దేశ రాజ కీయాలకు సంబంధించి, ముఖ్యంగా

ఆంధ్రలో మితవాదులు, అతివాదులు ఎవరుండిరి ?

జవాబు : రాజమహేంద్రవరంలోని శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులు వంటి మితవాదులు కొద్దిమంది ఉండే వారు. పంతులుగారికి గాంధి యందు చాల గౌరవముండెడిది. ఆ రోజుల్లో మర్యాద తప్పని అతి (తీవ్ర) వాది గాంధియే యని నా అభిప్రాయం. గాంధిని తీవ్రవాది యంటే చురుకైన కార్యవాది యనియే నా భావం. అప్పటి సర్కారు మీద అతడు తల పెట్టిన 'సహాయనిరాకరణం', 'శాసనో ల్లంఘనం' ఆధునిక చరిత్రలో అతః పూర్వము మనం కని, విని యుండ లేదు. 'బ్రిటిషు' సైతాను ప్రభుతపైన అతడు ప్రకటించిన తిరుగుబాటులో యిసుమంత దౌర్జన్య (హింస) లేదు. ఆత్మ గౌరవం, ఆత్మ సంయమం దాని గుర్తులు.

ప్రశ్న : 4. కష్టనష్టాలను గణించక స్వాతంత్ర్య పోరాటానికి నడుము కట్ట వలెననే నిశ్చయం ప్రజలలో ఎట్లా కలిగింది ?

జవాబు : గాంధి దక్షిణాఫ్రికా వదలి ఇండియాలో అడుగు పెట్టే వరకూ దేశం మొత్తం మీద వాతా వరణంలో చైతన్యం లేని ఉదా సీనతయే, అలక్ష్యమే నిండియుండెను. మహాత్ముడు యిండియాకు వచ్చి సబర్మతి యొడ్డున చేసిన ఆశ్రమ నిర్మాణంతో ఇండియా చరిత్రలో నూతనశకం ప్రారంభ మయింది. రాజకీయాలు తదితర సమస్యలు అటుంచి, ఈ ఆశ్రమ స్థాపనతో నాక అహింసా విప్లవం అందుకుంది. నెమ్మదిగా అదే 'చంపారన్, కెయిరా' సత్యాగ్రహాలకు దారి తీసింది. అదే దారిని రౌలట్ శాసనాన్ని ఎదు ర్కొనడం జరిగింది. ఆ వెంటనే పంజాబ్‌లో డయ్యర్ అమాయకులగు ప్రజలపై చేసిన మూకుమ్మడి సంహారం పట్ల దేశమంతటా ఆగ్రహా వేశం బయలు దేరింది. రాజ్యాంగ సమస్యల పట్ల తటస్థులై యుండిన సామాన్య ప్రజానీకం ఈ దురంతం యొక్క వార్త వినగానే ఉడికి పోయింది. స్వభావసిదంగా ధర్మనిష్ఠు డగు మహాత్ముడు ప్రజలలో భావ స్వాతంత్ర్యం కర్మ (action) స్వాతంత్ర్యం రగుల్కొల్పాడు. ధనా ఢ్యులగు పై తరగతులూ అట్టడుగు బిచ్చగాండ్రూ కాక, మధ్య తరగతి ప్రజలు కని విని యెరుగని ఉత్సా హెూద్వేగాలతో ఉద్యమానికి దోహదం చేశారు. ఆకస్మికంగా యావత్తు దేశంలో వాతావరణం అద్భుతంగా మారింది. నా వంటి వాళ్లతో సహా ప్రజానీకం గాంధీ పతాకం క్రింద నిలిచారు.

(ఇంకా వుంది

గాంధేయ సమాజ సేవా సంస్థ (అవనిగడ్డ - 533 123) సౌజన్యంతో ... పుస్తకం వెల : రు. 20-00.

# సమీక్షలు　　చిత్రజగతి

సుజయా వారి

'అక్క మొగుడు'

తల్లి చనిపోయి, తండ్రి చింతామణి దాసుడు కాగా, గంగ (సుహాసిని) నలుగురు చెల్లెళ్లనీ (యమున, సరస్వతి, కృష్ణవేణి, గౌతమి) నేర్పుగా సాదుకొస్తూ వుంటుంది. ఇద్దరు చెల్లెళ్లు ఉద్యోగం చేస్తున్నారు; ఒకరు నిర్మా వాషింగ్ పౌడరు పాకెట్లు అమ్మగా, మరొకరు అన్నిటికీ 'ఏమో' తో సరిపెట్టే విద్యార్థిని. గంగ నోరు పెద్దది - కాని, చక్కటి మాటకారి. ఇంటి పట్టున వుండి యిల్లు దిద్దుతూ సంగీతం పాఠాలు నేర్పుతోంది. సుత్తిలో శ్రుతిలయలు, మట్టి ఘటంలో తాళగతులు, కొండ గాలిలో గాంధారం వున్నాయనే కార్ల మెకానిక్ రాజు (రాజశేఖర్) చేసే టింకరింగ్ శబ్దాలు భరించలేక పోలీసు కంప్లయింట్ యిస్తుంది గంగ. ఇనస్పెక్టరుగారు వెంటనే పోలీసులతో హాజరై మెకానిక్‌ని వారించడానికి బదులు, అతనితో ఆప్యాయంగా మాట్లాడి, గంగ వద్దకు వచ్చి 'హత్యానేరానికి గాను ఏడేళ్లు జైలు శిక్ష అనుభవించి, విడుదలైన మంచివాడు. ఆకాస మంత మనసు అతనిది' అంటాడు. మర్నాట్నుంచీ గంగ, తమ పక్కన ఒకఖూనీకోరు వున్నాడని కనిపించిన వాళ్లందరికీ చాటిస్తుంది. తాగుబోతైన తండ్రి పన్నిన వలనుంచి, రాజు వీరిని రక్షించే సరికి గంగ మనసు మారుతుంది. అసలతను ఖూనీకోరు ఎందుకయ్యాడంటే : ఒక వర్షపు రాత్రి తన కారు ట్రబుల్ యివ్వగా, గరాజ్ కొచ్చిన మెడికల్ విద్యార్థినిని, తమ 'బాస్' బలాత్కారం నుంచి కాపాడేందుకు! ఆ విద్యార్థిని పరువు ప్రతిష్టలు కాపాడేందుకు, ఆమె తను కోర్టు కొచ్చి సాక్ష్యం చెబుతానన్నా వొద్దంటాడు. స్త్రీజాతి, స్త్రీలపట్ల అంత గౌరవం అతనికి - ఇనస్పెక్టరుకి తెలుసు యిదంతా రాజుకి, గంగకి పెళ్లవుతుంది. అక్కగారికి ఒక 'జెర్క్' యిద్దామని నలుగురు చెల్లెళ్లూ, ఒకే కంచంలో తిన్న వాళ్లము కాబట్టి, వారంలో నాలుగు రోజులు ఒక్కొక్కరం చొప్పున పంచుకుంటాం, కట్టుకున్నావు కాబట్టి నీకు రెండు రోజులు, ఏడో రోజు సెలవు యిద్దాం - అంటారు. పితృస్థానంలో వున్న రాజు నలుగురుమరదళ్లకి మంచి సంబంధాలు చూసి పెళ్లిళ్లు చేయడం తన పవిత్ర బాధ్యతగా, తన కర్తవ్యం

నెరవేర్చి కన్ను మూస్తాడు. రాజుది గంభీరమైన పాత్ర; సుహాసిని గొప్పగా పోషించింది. రక్కున అతికేలా గణేశ పాత్రో.... సంభాషణలు; వేటూరి పాటలకు, రాజ్ - కోటి మ్యూజిక్ శ్రావ్య మధురిమ నిచ్చింది. దర్శకులు క్రాంతికుమార్ ప్రేక్షకులని మెప్పి స్తారు, మెప్పిస్తారు; నిర్మాత; అప్పారావు.... పి ఆర్ ఓ: రాజు.

## ఫిల్మిండియా ఆర్ట్స్
## అ ం కు ర ం

సివిల్ లిబర్టీస్ ఆనాటికానాడు ఎలా మృగ్యమై పోతున్నాయో, సామాజిక రక్షణ ప్రథమ కర్తవ్యంగా గల పోలీసు శాఖ ఎలా అడ్డ దారులకి పాల్పడుతున్నదో, రోషాలకు, ద్వేషాలకు లోనై, ఆ దెబ్బ తమకు తగిలే దాకా ఎలా కనువిప్పు కావడంలేదో, యువ దర్శకులు ఉమామహేశ్వర రావు, ఎంతో సూటిగా గుండెని తాకే టట్టు, మనసుని కల్లోల పరిచేటట్టు చెబుతారు. ఉత్తరార్ధంలో యిం కొంచెం శ్రద్ధ తీసుకొని వుండాల్సింది. జంట పాటల శృంగార లీలల వింత విన్యాసాల హీరో హీరోయినుల గాథ కాదిది. పుట్టింటి నుంచి అత్త వారింటికి వస్తున్న 'సింధు' (రేవతి), రైలు పెట్లో ఎదురుగా కూచున్న వ్యక్తి ఒడిలోని పసివాడు గుక్కపట్టి ఏడు స్తూంటే, 'యిలా యివ్వండి' అని చేతులలోకి తీసుకు, 'ఆకలేసి పాల కోసం ఏడుస్తున్నాడేమో' - అంటుంది, పాల సీసా సంచీలో నుంచి తీస్తా డతను - కాని, ఖాళీ. గురజాలలో పాలు కొని పట్టుకొచ్చేందుకు దిగు తాడు. సీసాలో పాలు పోయించు కుంటాడు; కాని, యింతలో పోలీ సులు వచ్చి అతనిని రైలు ఎక్క నివ్వరు. పసివాడిని సింధు ఏం చేయాలి? భార్యని రిసీవ్ చేసుకో డానికి స్టేషన్ కొచ్చిన భర్త ఈ 'లగేజి' ఏమిటని ఆశ్చర్యపోతాడు గాని ప్రారంభంలో సానుభూతితో అర్థం చేసుకుంటాడు. ఆ 'సత్యం'కు (ఓంపురి) బాలుని వొప్పగించేందుకు, సింధు పడ్డ అవస్థలు, అగచాట్లు, అవ మానాలు - ఒక్కటేమిటి మొత్తం ఆమె జీవితమే తలకిందులై సమిధగా మారుతుంది. తండ్రి (బాలయ్య), లాయరు (శరత్ బాబు) ఆమెకు అండగా నిలబడతారు. ఆరు నెలల గర్భిణీ స్త్రీ చేత గుంజీలు తీయించి ఆమె మరణానికి కారకుడైన పోలీసు ఇనస్పెక్టరుని పల్లెవాసులు పొడిచి చంపుతారు. తమ కొలీగ్‌ని చంపి నందుకు ప్రతీకారంగా ఆ పల్లె తగల బెడతారు పోలీసువారు. బయటికి పొక్కకుండా అక్కడ డాక్టరుని (చారుహాసన్) కాల్చేస్తారు; ఫోటోలు తీసిన రిపోర్టర్‌ని కాల్చేస్తారు; సాక్ష్యం మాఫీ చేసేందుకు యిదంతా. చివరికి నిజం బైట పడుతుంది. ఇటువంటి 'అమ్మ'లే (సింధు) జాతికి రక్ష-అంటూ న్యాయస్థానంలో కళ్లుమూస్తాడు సత్యం. తనికెళ్ల భరణి సంభాషణలు. నిర్మాత: సురేష్‌కుమార్.... పిఆర్ఓ: జగన్.

*Travelogue*

# Another Week in West Bengal

Monday morning (30-3-1992) at eight-thirty we got into the vehicle. It was an airconditioned comfortable car and the dickey was filled up with our overnight baggage and plenty of eatables, fruit, ice-cool soft drinks etc. Besides the driver, I was the only male member of the party, the other four being Radha, Subhadra, Sundari and Malati. As we left city limits, there were fields on both sides with abundant growth of vegetables. In West Bengal the soil is very fertile to a depth of eight feet, they say. It was a pleasure to watch rickshaws, carts, three-weelers and trucks in the opposite direction carrying plenty of green vegetables into the city markets.

After about forty minutes the car came to a halt, as it was time for breakfast. Everybody voted that way. Idli, vadai, sandwiches, fruit and soft drinks. Unpacking and re-packing, small jokes and pleasant gossip, - all that took about half-an-hour and then to Krishna Nagar where from a gentleman would escort us to Mayapur. Krishna Nagar is a district in West Bengal and the place to which we were to go is a district headquarters. At that time we didn't know the importance of Krishna Nagar as a big centre for handicrafts and exports them earning a lot of foreign exchange. The other day when we watched it on the TV, we regretted how we missed such a unique opportunity of seeing those exquisite works of art.

The concerned gentleman (let me call him Bannerji) was waiting for us and he accompanied us Mayapur in his car. Mayapur is about 130 km or so from Calcutta. We had plans to go to Nav Dweep, a famous place of learning, that evening or next morning. Bannerji had already arranged for us two spacious airy rooms with artistic furniture and modern amenities at the Iskcon Guest House. Till we actually landed on the premises, I didn't know that we were visiting Prabhupada's Temple. All these days I was under the impression that Radha

had included Mayapur in our itinerary because of Gaudiya Mutt and Chaitanya Prabhu. It appears one of her aunties was a devotee of Chaitanya and as such she was given the name Radharani, though we call her Radha.

The atmosphere at Iskcon Centre was full of reverence and devotion to Krishna. It was a very pleasant surprise to enter the premises where Prabhupada built his main Krishna Temple. About twelve years back I read in the IME Magazine about this Prabhupada - a saffron-clad swamiji, with a trunk load of books, entering the states after a strenuous ship-journey and in a short span of a decade, publishing about sixty volumes and establishing more than one hundred shrines world over. Though confined to spiritualism and Krishna Cult, it was an achievement of astounding proportions About Hare Rama Hare Krishna boys and girls and their Ratha Yatra when I read in newspapers, it appeared to me like carrying coal to New Castle.

Of the two rooms, the Chendurs were given one, and the three ladies occupied the other. After a wash, we were taken to lunch where prasadam (food) was served. Squatting on the floor, we enjoyed the sumptuous meal. Resting a while, we came down to the prayer hall at three thirty. Devotees were dancing and chanting. It was a rhythmic movement where you tilt the body side ways, chanting in a mellifluous tone. The tilting of the body has a slow effect on your circulatory system and heartbeat, while the chanting works on your mental makeup and nervous system. We find some of the devotees falling into a trance - that is not pretence- it has to happen to certain individuals. Chaitanya Cult of about 400 years old is just surrendering yourself in body and soul to the Lord, thro' dance and song where rhythm plays a crucial role.

In the Prayer Hall we find Radha and Krishna along with his eight consorts on a broad panel. Prabhupada is seated opposite. The floor is clean, shining and well-polished. The devotional fervour is there as we find in Bhajans but not beyond that. After fifteen minutes Radha said, 'Let us go into the town and find out whether Chendurji and Sundari

could get tea - it is already tea-time for them. It seems they do not have tea or coffee in these premises - those who visit this place are not expected to consume such beverages.'

We took the vehicle and went round that village in search of some hotel where we could get some coffee or tea. We could not find any. We saw the place where Chaitanya rested and the tomb of the nawab before whom Chaitanya sang in glory of Krishna, non-stop for three days and nights to convince him of his truthfulness. Thereafter that nawab was a changed man. A small Muslim hamlet by name Miapur slowly got changed into Mayapur. In a decript spot, under the shade of a tree, we saw the tomb of that noble nawab. Just like that of Aurangazib's at Daulatabad. Gaudiya Mutt and Birla's Place looked well kept. Iskcon Centre has all the modern taciliers with a lot wealth and a huge number of visitors pouring in every day, while the rest of the village looked dull, drab and dirty, wiih poverty writ on most faces.

While we were getting back to our rooms, we came across a devotee, who evinced some interest in us. He is a graduate of upper middle class-father, a pilot and mother an urban office employee - both working persons. Somehow they were drawn to this organisation and found peace and harmony in it and they wanted their son to follow the same path. Hailing from Bangalore they settled in Bombay. This devotee (whose name we came to know later as Ramalinga) showed us all about Prabhupada and gave us a unique opportunity to watch the video-tapes. In a particular room we find Prabhupada sitting in padmasana - for a moment you feel he is there in his mortal frame physically - it is a statue carved out in extreme reverence. As you move about those rooms glancing at the books and watching the video, you cannot but feel thrilled at the achievement of a spiritual empire spreading over the continents with that Krishna Consciousness. Personally my approach towards life and it problems is different. But here is a great son who catered to the spiritual need of vast millions living under perpetual strain and stress. We are deeply grateful to Devotee

Ramalinga who explained to us in detail in the language we comprehend and understand.

Next morning we visited their gurukul where we found white-skinned boys with shaven heads and tufts chanting Vedic Slokas and reciting Sandhya Vandanam with precise intonation. Their age is between five and twelve and for the sixty students, there are twelve teachers - the teacher being the boy's friend, guide and philosopher. It is an example of Gurur Brahma - nothing short of it. Radha fell in love with those devoted little children to whom work and play and learning stand on the same plane. Mud - dwellings with thatched roofs and constant sweeping to keep the place neat and tidy. Nothing is a menial task for them. Self-help and helping your neighbour are their primary objectives.

Last evening we had no tea but this morning we could get coffee at a wayside shop, just outside the premises of Iskcon - opposite the main gate. We regretted how we failed to make this discovery yesterday itself. Visit to Nava Dweep was cancelled and the ladies, Subhadra and Sundari, were keen on purchasing some Bengali sarees on way at Purulia. And we told Prabhakara Rao of the National Library that we would be at that Great Temple by three or three thirty.

During the return journey Sundari asked "Yesterday you purchased that book. Have you skipped thro thro ?"

"Where is the time? I must go thro' it only on reaching Madras. It is a four-hundred page book," I said.

"How lucky - We are spared the torture of a lecture," commented Malati.

"I don't approve of that - familiarity makes you talk like that," said Radha.

Abhay Charan De was born in Calcutta on Sept. 01, 1896. The family had a cloth shop and the father was such a religious, cautious person that he would leave a morsel of food every night in the contre of the shop for the rats to consume, lest those rats might gnaw at the cloth. Radha Govind Temple was nearby and to that Vaishnavite family, Ratha Yatra - Krishna, Balaram and Subhadra in a Chariot - was a great festival. Its origin was

in Puri Jagannath, three hundred miles away from Calcutta. Even today Ratha Yatra draws lakhs of devotees - just like dying in Kasi, to die under the wheels of that jaggernaut is considered holy - a pious act towards Janma Rahitya.

Abhay was married before his finishing college. Bhakti Siddhanta Saraswati of Gaudiya Mutt, propagating Chaitanya Cult, was the first guru that influenced this young man Abhay. Marriage, children, family ties, business - none of these things could deter Abhay from his chosen path of spreading Chaitanya Cult, of which he was familiar. Abhay started a magazine by name, 'Back to Godhead' to convey the message of his guru Sri Srimad Bhakti Sidhanta Saraswathi Goswami Prabhupada. Several visits to Brindavan, finally made Abhay renounce the family life and embrace Sanyasa. Thus he became Bhakti Vedanta Swamy and brought out Srimad Bhagawatam and presented the copies to the then Prime Minister Lal Bahadur Sastri, Vice President Zakir Hussain, Governor Biswanath Das etc. Hanuman Prasad Poddar gave a donation of five thousand for bringing out Bhagawatam. He was staying in Brindavan and coming to Delhi to print and disribute his magazine 'Back to Godhead'

With missionary zeal and implicit faith in Krishna, he stood as a rock. One Agarwal of a similar religious disposition got him a sponsor letter from the States and Sumati Morari (Scindia Steamship Line) though reluctantly, offered free passage in a cargo ship. With a truck load of 203 volumes of Bhagawatam, he sailed from Calcutta on August 13, 1965 to reach Boston after 35 days of sea journey. At the age of 70 he went to the States to spread the message of Chaitanya. Ruben, a Turkish Jew, was the first friend Bhakti Vedanta Swami in the new land. Starting with a single disciple, the number rose to four thousand.

In the later sixties, Ratha Yatra in American cities was a novelty as well as a craze. With the Vietnam War and Drug Addiction, the soil was quite favourable to spread the Message of Krishna. He encountered all troubles and travails, till he reached New York. Thereafter it was another success story in a different realm.

Early 1977 he was in Bombay, then in Bhuvaneswar,

Mayapur and Brindavan. He thought of going to the States for recouping his health. Of course, to all spiritual leaders, the material world is all bones, while the real world is the Living Force. To Prabhupada who brought out 30 volumes of Bhagawatam, 3 volumes on Krishna. 17 volumes of Chaitanya Charitamrita and many more such monumental works, – books were his life and soul. He reminded his disciples of King Kulasekhara's Prayer: "Lord Krishna, please help me to die immediately so that the swan of my mind may not be encircled by the stem of your Lotus Feet." And he attained Saaropya or Saayujya, or whatever you call that - One with the Lord - on Nov 14, 1977.

Those are the broad outlines his life. ISKCON is what he created, a spiritual, religious organisation, with a good number of temples world over. And Krishna Consciousness is a sort of a dynamic force for the betterment of humanity.

Hare Krishna Hare Krishna - Krishna Krishna Hare Hare

Hare Rama Hare Rama - Rama Rama Hare Hare

To us brought up in Puranic lore, Rama and Krishna are two different incarnations of the same Vishnu with a thousand names but to the Western Mind there is a magic spell in that intonation.

I thought I could cover the National Library as well in this instalment but it is go for the next one.

*(to be continued*

—**NR CHENDUR**

# మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటాయనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ఈ పత్రికలో వెలువడేవన్నీ మాఅంతట మేము కోరి వ్రాయించేవి - అంచేత, ప్రచురణ నిమిత్తం వ్యాసాలూ, కథలూ, కవితలూ పంపవద్దు. ఎప్పుడైనా అవసరమైతే, మేమే అడుగుతాము.... చందా 24 సంచికలకు : ఏభై రూపాయిలు.

JAGATI - 2, Kutchery Road, P.B. 2922, Mylapore, Madras-600004

ఆగస్టు 05 1992

భమిడిపాటి రాధాకృష్ణ, సుశీలా దంపతుల మూడో అబ్బాయి చి॥ వెంకట శేషగిరిరావుకి, ఆ కె ళ్ల మోహనరావుగారి పెద్దమ్మాయి సౌ॥ వెంకట రత్నకుమారికి, ఈ ఉదయం 9 గం॥ 39 ని॥ లకు నల్వాజు కళ్యాణ మండపంలో వేదో_ విధులతో వివాహం, ఉదయం ముహూర్తానికీ, సాయింత్రం రిసెప్షన్‌కీ తెలుగు చలన చిత్రసీమలోని పెద్దలనేకులు వచ్చి నూతన వధూవరులను ఆశీర్వదించారు. నవదంపతులకు మా శుభాకాంక్షలు.

కింగ్ ఆర్థర్ గురించిన ప్రసక్తి అయిదారు శతాబ్దుల నాటిదిగా వినిపిస్తుంది. పరాక్రమ శాలిగా, క్షాత్ర వసింహునిగా అతనికి రూపమిచ్చారు. 9వ శతాబ్దినాటికి ఆర్థర్ గురించిన కథలు అనేకం వ్యాప్తమయాయి బ్రిటిష్ దీవులలో. వీటన్నిటినీ 'హిస్టారియా రిగమ్ బ్రిటానియె' అనే పేరుతో, జియాఫ్రీ 1135లో లాటిన్ భాషలో గ్రంథస్థం చేశాడు. అప్పటికి ఆనోటా ఆనోటా వినిపిస్తున్న కథలన్నీ తీసుకు, డేనుల, సాగ్జనుల ముట్టడిని విజయవంతంగా ఎదుర్కొని, ఆంగ్లేయుల గౌరవం నిలబెట్టిన వీరశిఖామణిగా చిత్రించాడాయనని. అనేక యుద్ధాలలో నెగ్గి, విజయ గర్వం తలకెక్కగా, రోమ్‌కి కప్పం చెల్లించేందుకు నిరాకరించి, చివరికి తన భార్య మోసంవల్ల, వారసుని కుట్రవల్ల అంత మొందుతాడు ఆర్థర్. 1150 నాటికి 'రౌండ్ టేబిలు' అనేది ఒకటి వుండేదనీ, దాని చుట్టూ 'నైట్స్' (సామంతులు) కూచునేవారనీ, ఆర్థర్ వారికి నాయకునిగా రాజులా వ్యవహరించేవాడనీ జియాఫ్రీ తన రచనల్లో పేర్కొంటాడు. దీనిని 13 వ శతాబ్దంలో 'లెయమాన్' ఇంగ్లీషులోకి అనువదించాడు. కాని, 12 వ శతాబ్దంలోనే ట్రాయిస్ అనే ఫ్రెంచి రచయిత, ఆర్థర్ చుట్టూ అయిదు వీరోచిత ప్రణయ కావ్యాలు రాశాడు. 1471 లో సర్ తామస్ మెలోరి, అప్పటిదాకా చెలామణిలో వున్న వాటిని గుచ్చెత్తి, వచనంలో కథలు చెప్పాడు. చివరికి తేలిందేమిటంటే, ముఖ్యులుగా ఆర్థర్, లాన్స్‌లాట్, గినివిరి మిగి

లారు. భట్టి విక్రమార్కుల కథలు ఎంత అసంఖ్యాకమో, ఆర్థర్ గురించి నవి కూడా అంతే! చారిత్రక సంధ్య లోని మహా వీరునిగా నిలిచి పోయాడు కింగ్ ఆర్థర్ - ఆంగ్లేయులకి! స్పెన్సర్, టెన్నిసన్, ఆర్నాల్డ్, మారిస్, స్విన్ బర్న్ - వీరందరూ ఆర్థర్ గాథలలో నుంచి తమ కవితా సామగ్రి కొంత స్వీకరించారు.

ఆర్థర్ ఒక రాజు. గినివిరి అతని రాణి; తలిదండ్రుల వద్దనుంచి అపహరింపబడ్డ బాలుని, నదీ సుందరి పెంచుతుంది - అతను లాన్స్‌లాట్. నిరజ్జతో భర్తని వంచించిన భార్య పరివ్రాజిక (నన్) అవుతుంది; క్షాత్ర నీతికి విరుద్ధంగా నడిచిన లాన్స్‌లాట్, ప్రభుసేవకు శేషజీవితమిస్తాడు. నిరంతర స్పర్థలో నలుగుతూ ప్రజల మంచితనంపై అకుంఠిత విశ్వాసం వుంచిన ప్రభువు తనకు తోచినదిగాక, ప్రజాహృదయం చెప్పేదే న్యాయమనీ, సామూహిక శ్రేయంలోనే భవిష్యత్తు వున్నదనీ ప్రజావళిని నమ్మించి, తను కాలగర్భంలో కరిగి పోయినా, నాటిన మొక్క మాత్రం పచ్చదనం చెడకుండా కట్టుబాట్లు చేస్తాడు. ఆర్థర్‌లో మనకు ధీరోదాత్తత, ధీరలాలిత్యం కనిపిస్తాయి.

'కామెలాట్' [Camelot] అనే పేరుతో వెలువడ్డ ఈ చిత్రాన్ని (1967 - 166 ని॥) వెనకొకసారి చూశాము. బ్రాడ్వే నాటకం నుంచి ఈ పిక్చర్ తయారు చేశారు దర్శకులు జోషువా లోగన్. ఆర్థర్ పాత్ర రిచర్డ్ హారిస్; వెనిసా రెడ్‌గ్రేవ్ క్వీన్‌గాను, ఫ్రాంకోనీరో లాన్స్‌లాట్‌గాను నటించారు. అతి శ్రావ్యమైన సంగీత ధారతో, విస్మయం గొలిపే సంభాషణా పటిమతో, మనని పదకొండో శతాబ్దపు సౌందర్య వీధుల వెంట పయనింప జేసే ఈ చిత్రాన్ని అమెరికన్ సెంటర్లో ఆహ్వానితులకు చూపారు.

. . . . . 08

"సాహిత్యజ్ఞానం, సంగీత జ్ఞానం లోకజ్ఞానం - ఈ మూడూ వుండేనే నిర్మాత సక్సెస్ అవుతాడు. చక్రపాణికి ఈ మూడిటితో బాటు మంచితనం ఉంది; పత్రికల వారి పట్ల సద్భావం, అభిమానమూ వున్నాయి. మేకప్ మాన్‌గా ఇరవై పాతికేళ్ల క్రితం జీవితం ప్రారంభించి, సునిశిత పరిశీలనతో నిర్మాణ రంగంలోని లోతుపాతులూ, ప్రేక్షకాభి రుచులూ తెలుసుకు, దర్శకత్వంలోకి దిగి విజయం సాధించారు" - అన్నారు పరుచూరి వెంకటేశ్వరరావు, టాజ్ కోరమాండల్ క్లయివ్ రూమ్‌లో, తెలుగు ఫిలిమ్ జర్నలిస్ట్స్ అసోసియేషన్ ఏర్పాటు చేసిన 'మీట్ ది ప్రెస్' సందర్భంగా .... "నేను మళయాళ మాతృక చూసి, యిది తెలుగులో తీస్తే బాగా పోతుందని అనుకున్నాను. వెంటనే హక్కులు కొన్నాను. అప్పట్లో నాకు దర్శకత్వం వహించాలనే తలంపు లేదు - ధైర్యం చేశాను - తెలుగు వారు ఆదరించారు" - అన్నారు 'సూర్య

చిత్రా' ఎయమ్ రత్నం - మనసు ఎంత మెత్తనో, మాట అంత మృదువు అనిపించే కంఠంలో. "ఈచిత్రంలోని అడుసు మల్లి పరశురామయ్యని మళ యాళీ యాక్టర్ అని ఎవరూ అను కోవడం లేదు - తెలుగు వాడనే అను కుంటున్నారు" — అన్నారు పరుచూరి గోపాలకృష్ణ. 'పెద్దరికం' ఏభై రోజుల విజయోత్సవ సందర్భంగా 'అసోసియేషన్' కి పది వేలు విరాళంగా యిచ్చారు రత్నం. కార దర్శి జగన్ స్వాగతం తెలుపగా, ఉపాధ్యక్షులు శ్రీనివాస్, రత్నం గురించిన విశేషాలు వెల్లడించగా, అద్యక్షులు జగదీష్ బాబు సభా నిర్వాహణ.

..... 09

ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచ యితల సంఘం (మద్రాసు శాఖ) పొట్టి శ్రీరాములు హాలులో 'పుస్తక సమీక్ష' కార్యక్రమం .... 'మనిషి నా సమర నాదం' (శ్రీకాంత్ కవితలు) — ఆలోచింపనవసరం లేకుండా కార్యో న్ముఖులు గావించడం, ముత్యాల సరాల వరవడిలో సాగిన ఈ కవితల లక్షణం - అన్నారు సమీక్షకులు బాచు మర్తి దుర్గా ప్రసాద్‌రావు. యన్ టి రామారావుకి అంకిత మిచ్చిన కవితా సంపుటి యిది .... 'అర్నాద్' కథలు అందాలు వొలక బోస్తూ హక్కుల కోసం పోరాటం తప్పని సరి అని

---

## 'జగతి' చందా కూపను

2, కవేరి రోడు - పి.బి. 2922
మైలాపూరు - మద్రాసు-600 004

ఈ నెల నుంచి 24 సంచికలు పంపగోరుతూ రు. 50/-కు (ఏభై) బాంకు డ్రాఫ్ట్ లేదా పోస్టల్ ఆర్డరు లేదా మనియార్డరు రసీదు ఇందుతో జత పరిచినాను.

పేరు ..................................................

అడ్రసు ..................................................

..................................................

..................................................

తేదీ : సంతకం

---

చెబుతాయన్నారు వైవి యస్ సెన్ మూర్తి.... "చీరాల - పేరాల' అందోళన నుంచి, ఇందిరాగాంధీ దుర్మరణం దాకా, మూడు తరాల తెలుగుజాతి చరిత్రను మనసున ముద్రి స్తోంది మాలతీ చందూర్ 'హృదయ నేత్రి' అన్నారు కెవి రమణమ్మ.... రాంభట్ల వ్యాసాలు 'పారుటాకులు' సగటు పాఠకుని కదిపి కుదుపుతాయి- అన్నారు మల్లిక్ (అయన ఊళ్లో లేరు- ప్రసంగ వ్యాసం మరొకరు చదివారు) .... ప్రతి సమీక్షకుని వెంట వెంటనే ప్రశంసించే బదులు, సమీక్షలన్నీ అయిపోయాక, అధ్యక్షులు సాయి ప్రసాద్ మొత్తం కార్యక్రమంపై అభి ప్రాయం వెలిబుచ్చి వుంటే, బావుండే దేమో ననిపించింది.

#### .... 12

పివి రమణయ్య రాజా దంపతుల మనుమరాలు సౌ॥ వాణికి (శారదా రత్నారావు కూతురు) వెల్లూరుకి చెందిన పరాంకుశమ్ దంపతుల కుమారుడు చి॥ ప్రవీణ్‌కి న్యూ వుడ్‌లాండ్స్‌లో ఉదయం 9 గం॥ 18 ని॥లకు శాస్త్రో క్తంగా వివాహం జరిగింది. ముహూర్తా నంతరం విందు భోజనం. సాయం త్రం మండపాక శారద మ్యూజిక్. త్యాగరాయ కృతులు ఆమె గాన మాధురిలో రసగుళికలై శ్రోతలను శ్రవణానందంలో ముంచుతాయి. కాఫీ టిఫిను అనుకొని, డైనింగ్ హాలులోకి వెళ్లేసరికి, డిన్నర్ మించి నన్ని పదార్థాలు. రాజాగారి పార్టీలకు అలవాటు పడ్డా, 'యిన్నా ?' అని పించింది. కబుర్లూ అయిస్‌క్రీమ్ అయాక, కిందకొచ్చి, మళ్లీ కబుర్లు, నూతన దంపతులకు శుభాకాంక్షలు తెల్పడం. వాణీ ప్రవీణ్‌ల నవజీవన యాత్ర ఆనంద ప్రదంగా సాగాలని ఆంటీ, అంకుల్ మనసారా దీవిస్తున్నారు.

#### ..... 15

సిల్కు చీరెల నల్లి చిన్నసామి చెట్టి స్పాన్సరింగ్‌తో 'అగ్ని' వారి అక్షరా అవార్డ్ ఫంక్షన్ శంకర హాలులో. పోయిన నెల కేంద్ర సాహిత్య అకాడమీ ప్రధాన కార్య దర్శి ఇంద్రనాథ్ చౌధురి ముఖ్య అతిధిగా జయకాంతన్‌కి. ఇవ్వాళ మాలతీ చందూర్ ముఖ్య అతిథిగా 'సుజాత'కి ('సుజాత' పెన్‌నేమ్ - అసలు పేరు రంగరాజన్ - బెంగుళూరు భారత్ ఎలక్ట్రానిక్స్‌లో ఉద్యోగి). ....'అగ్ని' [Agni] అనగా Awakened group for National Integration 1986 జూన్ 14వ తేదీన టాజ్ కోరమాండల్‌లో ఈ సంస్థకు ప్రారం భోత్సవం జరిగింది - ఆనాటి అధ్య క్షులు శివజ్ఞాన గ్రామణి, ముఖ్య అతిధి చిదంబరం. తర్వాత 1989 అక్టో బరు 4వ తేదీన 'సౌత్ జోన్ కల్చ రల్ సెంటర్' సహాయ సహకారా లతో, నాలుగు దాక్షిణాత్య భాషల సాహితీకారులతో 'కవిరాత్రి' అని ఒక చక్కటి సాహిత్య కార్యక్రమం జరిగింది. నేను 'తెలుగు సాహిత్యంలో

యువత చిత్రణ' గురించి, మాలతి తెలుగు నవలల గురించి మాట్లాడాము. నాయని కృష్ణకుమారి, కొండేపూడి నిర్మల ఈ సమావేశంలో పాల్గొన్నారు. ఈ సంస్థ ట్రస్టీలలో ముఖ్యులు ప్రసిద్ధ రచయిత్రి శివశంకరి, తమిళ 'ఇండియా టుడే' కాపీ ఎడిటర్ మాలన్.... 'నేను నాలుగో ఏటనుంచి రాయటం మొదలెట్టాను. ప్రౌఢజీని కాదు, మాటలు పలకమీద రాయడం మొదలెట్టాను, ఆ మాటలు ముడివేయగా వాక్యాలయాయి. ఈ వాక్యాల నుంచి చిన్న చిన్న ఊహలూ కథలూ పుద్భవించాయి' - అంటూ హాస్యచతురిమతో శ్రోతలను 'పదేపదే నవ్వించారు సుజాత. ఆంగ్లంలో ప్రసంగ వ్యాసం (తెలుగు సాహిత్య పరిణామం) చదువుతూ, సుజాత మీద, నా మీద, యస్వియస్ మీద తమిళంలో జోక్సు వేసింది మాలతి. (భర్త మీద ఒక పాయింట్ స్కోర్ చేసేందుకు, తను తమిళం, సెల్ఫ్ - ఇనస్ట్రక్టర్ ద్వారా నేర్చుకున్నాననే సరికి, అందరూ హర్ష ధ్వానాలు చేశారు). శివశంకరి స్వాగతం మాలన్ వందన సమర్పణ. తెలుగులో ఒక్క 'ఈ నాడు' నుంచి తప్ప యింకెవ్వరూ రాలేదు ; తమిళంలో చాలామంది పత్రికల వారు వచ్చారు. (మర్నాడు 'దినతంతి' లో ఈ సభా విశేషాలు పెద్దఫొటోతో సహా వచ్చాయి).... "ద్రవిడ కుటుంబానికి చెందిన నాలుగు దాక్షిణాత్య భాషలలోను తమిళం అతి పురాతనం,

సంఘ సాహిత్యం అతి ప్రాచీనం. ఇక, తెలుగులోని మొదటి శిలాశాసనం కడప జిల్లా కమలాపురం తాలూకా ఎల్ల గుడిపాడుది - క్రీ. శే. 575.... కవిత్రయం, కృష్ణ దేవ రాయల కాలంనాటి అష్ట దిగ్గజాలు తర్వాత, 19వ శతాబ్దంలో ఆధునికాంధ్ర సాహిత్య యుగకర్తగా, సంఘ సంస్కరణోద్యమంతో తెలుగు జాతిని మేల్కొల్పిన మహనీయునిగా కందుకూరి వీరేశలింగం; వంద సంవత్సరాలు గడిచినా తళుకు చెడక, కాంతులీనే అద్భుత దృశ్య కావ్య మల్లి (కన్యాశుల్కం). 'మంచి అన్నది చెడ్డ అయితే - మాలనే అగుదున్' అని జాతి ముత్యాలు కూర్చిన గురజాడ అప్పారావు కనిపిస్తారు. స్వాతంత్ర్యోద్యమ ఝంఝా మారుతంలో, గ్రాంధిక వ్యావహారిక భాషా వివాదం సమసిపోగా, ఉన్నవ లక్ష్మీనారాయణ 'మాలపల్లి' ఆనాటి ప్రభుత్వం వారి ఆగ్రహానికి గురి అయింది.... ఈ శతాబ్ది ముప్ఫయిలలో ఆంధ్ర విశ్వ విద్యాలయం వారు, నవలల పోటీ నిర్వహించి, విశ్వనాధ సత్యనారాయణ 'వేయి పడగలు'కి, అడవి బాదిరాజు 'నారాయణరావు'కి బహుమతిని రెండుగా పంచి యిచ్చి, గుడిపాటి వెంకటచలం 'మైదానం' తిరస్కరించారు. అడవి బాపిరాజు, నోరి నరసింహ శాస్త్రి వంటివారు చెప్పుకోదగ్గ చారిత్రక నవలలు రాశారు. అయితే, నవలా ప్రపంచంలో విశ్వనాధ, చలం — యిద్దరూ చెరో వైపునా నిలబడతారు. ఒకరిది ప్రాచీన వైభవ స్వప్నం; మరొకరిది రానున్న ప్రపంచగానం. ఒకరు సత్సంప్రదాయానికి, మరొకరు మనో స్వాతంత్ర్యానికి పట్టం గట్టారు," - అంటూ గోపీచంద్, కుటుంబరావు జి వి కృష్ణారావు, బుచ్చిబాబు, శారద (నటరాజన్); అరవైలలోను డెబ్బయిల పూర్వార్ధంలోను వచ్చిన లేడీటైలర్స్, అనువాదాలు, సాహిత్య తస్కరణ, 'సప్లయ్ - డిమాండ్' సూత్రం - యిలాటివాటి గురించి ప్రస్తావించారు మాలతీ చందూర్. పొయిట్రీ, డ్రామా యిత్యాదుల జోలికి తను పోవడం లేదనీ తన ప్రసంగ వ్యాసంలో నవలలకే పరిమితమనీ తన అర్హత వాటి గురించి మాట్లాడటం దాకానే అనీ, తను ఈ రచనా ప్రపంచంలోకి యాదృచ్ఛికంగా ప్రవేశించానని, నలభై ఏళ్ల 'ప్రమాదావనం' మూడు తరాల పాఠకులపై ముద్ర వేసిందనీ జయకాంతన్, పార్ధసారధి, పుదుమైపిత్తన్, శివశంకరి, సుజాత వంటి వారి రచనలు తెలుగు పాఠకులకు పరిచయం చేయగల అపూర్వావకాశం తనకు లభించిందనీ అన్నారు మాలతీ చందూర్.

....16

ఒకప్పుడు తెలుగు సినిమాలు రాముడిని నమ్ముకున్నాయి. 'బండ రాముడు' నుంచి, 'అల్లరి రాముడు, అందాల రాముడు, అడవి రాముడు' దాకా ఎందరో రాముళ్లు ప్రత్యక్షమై

తెలుగు తెరనిశోభితం చేశారు. కాలం మారింది, అభిరుచులు మారాయి. ఇప్పుడు కావల్సింది రౌడి లేక మొగుడు. ద్వారకాక్రియేషన్స్ వారు 'మోహన్‌బాబు - రాధ' జంటతో 'విసు' కథ ఆధారంగా, తాతినేని ప్రసాద్ దర్శకత్వంలో, 'వింత మొగుడు' నిర్మిస్తున్నారు. ప్రేమించి పెళ్లి చేసుకున్న దంపతుల మధ్య 'నాగదేవత' అడ్డుగా నిలవడం యిందులోని ప్రధానాంశం. అతను నాస్తికుడు, ఆమె నాగభక్తురాలు; యిరువురిని ప్రణయబంధం కట్టేసినప్పటికీ, 'పెదవులు పలికెను, మధువులు చిలికెను - మరువను ఈక్షణం' అనే తన్మయత్వంలో మునిగినప్పటికీ, పూజా పరీక్షకులోను గాక తప్పదు. చాత్రాతి విజయలక్ష్మి నిర్మిస్తున్న ఈ చిత్రంలో జగ్గయ్య, గొల్లపూడి మారుతీరావు, సుధాకర్, రమాప్రభ, అనూరాధ మున్నగువారున్నారు .... పాటలు ఈ ఉదయం ఎమ్ ఎమ్ థి యే ట ర్ లో పాత్రికేయులకు చూపించారు .... పి ఆర్ ఒ: అర్జున రావు.

. . . . 22

అయిదారు వారాల క్రితం 'స్వాతి' బలరామ్ ఫోన్ చేసి, మాలతిగారిని నిపుణుల కమిటీలో వేసుకుంటానని అన్నారు. మిగతా జడ్జీలు ఎవరెవరని అడిగాను. ఆ నలుగురి పేర్లూ చేప్పారు. సరేనన్నాను. జులై మూడో వారంలో హైదరాబాదు నుంచి వస్తూ, విజయవాడలో ఒక రోజు ఆగినప్పుడు, "మమతా" రూమ్‌లో బలరామ్, 'స్వాతి' పాఠకుల సర్వే మహోత్సవ ఏర్పాట్లన్నీ చెప్పారు. నిన్న రాత్రి హౌరామెయిల్‌లో బయలుదేరి, ఈ ఉదయం 'స్వర్ణా - 208 'కి వచ్చాము.... ఉదయం ఎనిమిదిన్నరకి ప్రెస్ కాన్ఫరెన్స్ - అంటే అయిదుగురు న్యాయనిర్ణేతలను ప్రెస్‌కి పరిచయం చేయడం, మొత్తం 19 బహుమతుల ఎంపిక, ప్రేక్షకుల సమక్షంలో ఏ విధంగా జరిగేదీ వివరించడం..... ఆరువారాల పాటు వరసగా 'స్వాతి' వారపత్రిక కూపనులు ప్రచురించింది. ఆ కూపనులలో వుండే అంశాలు స్థూలంగా: 'మీ కుటుంబంలో ఎంత మంది వున్నారు? పిల్లలెందరు, పెద్దలెందరు? వారి వయసు, విద్య? పట్టభద్రులా, మెట్రిక్యులేటా? ప్రొఫెషన్? నెలసరి ఆదాయం? ఎలా ఖర్చు చేస్తారు? నిత్య వాడకపు వస్తువు లేమిటి? విసిఆర్ ఉందా? స్వంత యిల్లా, అద్దె యిల్లా? అద్దె ఎంత? పిల్లల చదువుకి ఎంత? బట్టలకు ఎంత? 'స్వాతి' వారపత్రికలో మీకు ఏఏ శీర్షికలు యిష్టం? - ఇలాటివి. ఆరు వారాల కూపనులు పూరించి, ఒకేసారి మొత్తం ఆరూ 'స్వాతి' వారపత్రిక అఫీసుకి పంపాలి. పంథొమ్మిది మంది అదృష్టవంతులైన పాఠకులకు, పన్నెండు బంగారు ఉంగరాలు, మూడు జతల బంగారు గాజులు,

రెండు మోపెడ్స్, ఒక బజాజ్ స్కూటర్, ఫస్ట్ ప్రయిజ్‌గా యిద్దరికి సింగపూర్ మలేషియా వైమానిక ప్రయాణం.... ఇవిగాక మరికొన్ని ప్రోత్సాహక బహుమతులు.

బలరామ్ స్వాగతం తెలిపిన మీదట "పాఠకుల సర్వే, పత్రికలు నిర్వహించడం కొత్త కాదు - అయితే, మనకి తెలుగులో కొంచెం కొత్త. గుజరాత్‌లో ఈ మధ్య ఒక దిన పత్రిక - నాలుగు లక్షల కాపీలు అమ్మే దిన పత్రిక - పాఠకుల సర్వే జరిపింది. ఇటువంటి సర్వేలు ముఖ్యంగా వ్యాపార సంస్థలకు, ఉత్పత్తి దారులకు ఎంతగానో ఉపయోగబడతాయి. అమెరికాలోని పత్రికలు జరిపే సర్వేకి సైతం, రీడర్‌షిప్‌లో, పది పదకొండు శాతానికి మించిన రెస్పాన్స్ ఉండదు. నాలుగు లక్షలు అమ్మే గుజరాతీ దినపత్రిక 'రెస్పాన్స్' కూడా పదిహేనూ ఇరవై వేలు. అలాంటిది, లక్షా అరవై వేల 'స్వాతి' సర్క్యులేషన్‌లో, 35 వెల చిల్లర ఈ సర్వేలో పాల్గొన్నారంటే, నాకు తెలిసినంతలో, యిది ప్రపంచం లోనే 'రికార్డ్ రెస్పాన్స్'గా పేర్కొన వచ్చు. పాఠకుల అభిమానానికీ ఉత్సాహానికీ యిది కొలబద్ద" - అన్నారు ఈ సర్వే అధ్యక్షులు విజి కృష్ణ మూర్తి - 'ముద్రా' కమ్యూనికేషన్స్ ___ర్మన్ .... మొత్తం 35 వేల ఎంట్రీలని, పక్కపక్కనున్న జిల్లాలని కలివి జోన్స్‌గా చేసి, ఆరు జోన్స్‌లో నెంబర్ల వారీ, ప్రతి కూపన్ సెట్‌కీ నెంబరు వేసి, వరసక్రమంలో, విశాలమైన బాక్సుల్లో పేర్చడం, జీరో నుంచి తొమ్మిది దాకా వున్న అంకెలని డబ్బాలలో నుంచి (మూడు విడి విడి డబ్బాలు) ప్రేక్షకుల చేత తీయించడం అన్ని జోనులకు సమానావకాశాలు ఉండేటట్టు చూడటం, నెంబరు బ్లాక్‌బోర్డు మీద వేసిన కొద్ది క్షణాలలో ఆ కూపన్ బంచ్ పేరు ప్రకటించేందుకు న్యాయ నిర్ణేతకు యివ్వడం (నెంబరువారీ కూపన్ల దొంతర్లు 'వుడెన్ ట్రేస్'లో పేర్చి వుంచటం వల్ల అది సాధ్యం) - ఈ ప్రకారం ఫూల్‌ప్రూఫ్‌గా, ఏ ఒక్కరూ వేలెత్తి చూసే అవకాశం లేకుండా, ఎలా ఏర్పాటు చేసినదీ, విశదపరిచారు ప్రొఫెసరు పరిమి పాత్రికేయులకు - ఎటువంటి సందేహాలకు ఆస్కారంలేని ఎంపిక విధానం.

ప్రెస్ మీట్ తర్వాత బలరామ్ మా రూమ్ కొచ్చి కాసిని కబుర్లయాక, 'రేపు సాయంత్రం అయిదు గంటల దాకా మీరు ఫ్రీ - కారు రెడీగా ఉంది - మీ యిష్టం వచ్చిన చోటుకి వెళ్లవచ్చు. నూజివీడు వెళ్లరూ ?' - అన్నారు. ఎందుకు వెళ్లం ? ఇవ్వాళ నూజివీడు; రాత్రి రూమ్ కొచ్చి, రేపు గుంటూరు .... హాస్పిటాలంటే అంటే బలరామ్‌ని చూసి నేర్చుకోవాలి. సంపద వుండగానే సరికాదు - దానిని సద్వినియోగ పరచగల మంచిమనసు కూడా వుండాలి. పాఠక దేవుళ్లతో సంపాదకుడు తన సంతోషాన్ని పంచుకొనే ఈ మహోత్సవం

తెలుగు జర్నలిజమ్‌కి వన్నె తెచ్చింది. సినీ శతదినోత్సవాలను మరిపించింది.

. . . . . 23

లిఫ్ట్ దిగి, రిసెప్షన్‌లోకి వస్తూండగా, సిండికేటెడ్ జర్నలిస్ట్ వెంకట నారాయణ ('స్వాతి'లో న్యూస్ లెటర్), 'రేపు' (ఒకనాటి సైకాలజీ మాస పత్రిక) నరసింహారావు కనిపించారు. గ్రీటింగ్స్ అయాక నలుగురం 'స్వాతి సర్వే మహోత్సవ కారు'లో తుమ్మలపల్లి కళాక్షేత్రం చేరుకున్నాం. ఎనిమిదేళ్ల క్రితం, 1984 ఆగస్టు ఒకటో తేదీన, యిదే కళాక్షేత్రంలో 'స్వాతి' సపరివార పత్రిక ప్రారంభోత్సవం జరిగింది. ఆవుల సాంబశివరావు అధ్యక్షత వహించగా, వైశ్యా బాంక్ ఛైర్మన్ రమేష్ గెల్లి ప్రథమ సంచికను విడుదల చేశారు. సంజీవ్‌దేవ్, రాచకొండ విశ్వనాధ శాస్త్రి, ఇంద్రకంటి శ్రీకాంతశర్మ ప్రసంగించారు; దైవజ్ఞశర్మ ఆశీర్వదించారు. 'స్వాతి' సుందరులకు డివి నరసరాజు, సుందరీలకు మాలతీ చందూర్ కిరీట ధారణ గావించారు. ఈ విషయమంతా ప్రస్తావిస్తూ ఆనాటి 'డైరీ'లో " 'ధీరుల్ విఘ్న నిహన్య మానులగుచున్ ధృత్యున్నతోత్సాహము' చూపుతారు; అటువంటి ప్రజ్ఞానిధి వేమూరి బలరామ్" - అన్నాను ('జగతి' 338 - అక్టోబరు 1984 ....అది ప్రారంభోత్సవం - ఇది ఆనందోత్సవం - పాఠకుల అభినందనోత్సవం. అప్పుడూ యిప్పుడూ వేడుకలో పాల్గొన్నారు చందూర్స్.

ఈనాటి సభకు 'ముద్రా' కృష్ణమూర్తి అధ్యక్షులు. 'స్వాతి' సపరివార పత్రిక సంపాదకులు వేమూరి బలరామ్ స్వాగత వచనం తర్వాత, మాలతీ చందూర్ సందేశం, సిద్దార్ధ అకాడమీ ముమ్మనేని సుబ్బారావు ఆశీస్సులు, ఆంధ్రా యూనివర్సిటీ అబ్రహాం అభినందనలు. వికాస విద్యావనం ప్రొఫెసర్ పరిమి సర్వే నిర్వహణకి విజేతల ఎంపిక, ఒక్కో జోన్ - రెండేసి బంగారు వుంగరాలు చొప్పున, అడుగున ఆరవజోన్ నుంచి ప్రారంభించారు. ప్రేక్షకులలోని 19 గురు 19 మంది విజేతలను ఎంపిక చేశారు. డబ్బా గలగల్లాడించి ఒక అంకె తీయమంటారు; డబ్బాలో సున్నా నుంచి తొమ్మిది దాకా, పది చదరాలే ఉంటాయి; రెండో అంకె మరొక డబ్బాలో నుంచి, మూడవ అంకె మరొక డబ్బాలో నుంచి, ఈ విధంగా తీసిన అంకెలు బ్లాక్ బోర్డు మీద వేయడం, ఆ అంకె పూర్తి అవడానికి, 'వుడెన్ ట్రే'లో నుంచి నెంబరు వేసివున్న 'కూపన్ బంచ్' వెలికి తీయడానికి మధ్యగల వ్యవధి పది పదిహేను సెకనులు మాత్రమే; వెంటనే ఆ నెంబరు చెక్‌చేసి విజేత పేరు చదువుతారు అధ్యక్షులు.

మొట్టమొదట ఆ విధంగా వచ్చిన నెంబరు 62169, బహుమతి:

బంగారు వుంగరం. గెల్చుకున్నవారు : కెవి రమణారెడ్డి, సుమ్మలపల్లి, కడప జిల్లా. బంగారు వుంగరాల మిగతా పదకొండుగురు : పి నాగరత్నం, కమలా నగర్, అనంతపురం ; కెకె సుబ్రహ్మణ్యం, కైకలూరు, కృష్ణా జిల్లా ; వి ఆంజనేయ ప్రసాద్, రిసెర్చి సెంటర్, నూజివీడు ; గంధం విజయలక్ష్మి, రవీంద్రనాథ్ టైప్ ఇన్‌స్టిట్యూట్, కొవ్వూరు ; ఒజియస్ ప్రసాద్, శ్రీరామ్ నగర్, రాజమండ్రి ; ఎ గంగాదేవి, హనుమ కొండ ; పి రాజేంద్రప్రసాద్, వరంగల్లు ; శ్రీరమణ, అరకు, విశాఖ జిల్లా ; యస్ మోహనరావు విజయ నగరం ; యన్ లక్ష్మి, బర్కత్‌పురా, హైదరాబాదు ; యస్ శ్రీనివాస్, కరీమ్‌నగర్ .... బంగారు గాజుల జత అందుకున్న ముగ్గురు : పి వెంకటే శ్వరమ్మ, గన్నవరం, కృష్ణాజిల్లా ; అబ్దుల్ వజీర్, కోదాడ ; కొండా మాధవ నారాయణ భార్యలు, హైదరాబాదు.... రెండు మోపెడ్స్ : బి వెంకటరెడ్డి, బ్రాహ్మణ కాక అగ్ర హారం, నెల్లూరుజిల్లా ; బాలా త్రిపుర సుందరి, భోపాల్ .... బజాజ్ స్కూటర్ : పి విజయలక్ష్మి, బ్రాహ్మణ గూడెం, పశ్చిమ గోదావరి జిల్లా.... ఇరువురికి విదేశ యానం - బంపర్ ప్రయిజ్ - 65035 నెంబరు గల ఎంట్రీ .... పి. నాగమణి, 1- 64 -1, కదిరి, అనంతపురం జిల్లా.

విజేతల పేర్లు వరసగా 'ముద్రా కృష్ణమూర్తి ప్రకటించి ఒక్కొక్కరిని అభినందించారు. నిపుణులని, ఫెస్టివల్ లో పాల్గొంటున్న యితర ప్రముఖు లని, శాలువలతో జ్ఞాపికలతో సత్క రించారు 'స్వాతి' బలరామ్ - ఈ సత్కార కార్యక్రమంలో తండ్రికి సాయపడింది మణి చందన .... బాలుడైన తరుణ్ గాక (కార్డులో వేసి నట్టు), సభాకార్యక్రమం రోజారమణి నిర్వహించడం ఎంతో సందర్భో చితం గాను, సమంజసంగాను వుంది ... కల్చరల్ ప్రోగ్రామ్ నిర్వహణ తనికెళ్ల భరణి. రాజ్ - కోటి సంగీత నిర్వహణలో మాల్గాడి శుభ ప్రేక్ష కులని వుర్రూత లూగించింది. మధ్యలో సిల్వెస్టర్ మిమిక్రి.... మరీ వుక్కగా వుండటం వల్ల పాటల మధ్యలో మేమూ, వెంకటనారాయణ బయలుదేరి వచ్చేశాము. ఆ తర్వాత మాలతిని సంజాయిషీ అడిగిందట మాల్గాడి శుభ.

'స్వర్ణా' అయిదో అంతస్తులో వోపెన్ ఎయిర్ డిన్నర్ ; వెట్‌పార్టీ అవటంచేత, స్త్రీల విభాగం వేరు. వెంకటనారాయణతో ఎంత సేపు మాట్లాడినా యింకా తెలుసుకోవాలని ఉంటుంది - అంతటి విస్తృత జీవిత మాయనిది డెయిలీ చూడని నాయకులు వుద్భవించారు మనకు : 'తమ ప్రాంతీయ భాష తప్ప మరొకటి తెలియని వారితో మాట్లాడట ఎంత కష్టం! కుంచుకు

పోయిన బుద్ధులూ మనసులూను, మన రాజకీయ జీవితంలో విలువలు పడిపోవటమనేది యివ్వాళ సంభవించినది కాదు. ఇరవై యిరవై రెండేళ్ల క్రితం పడిన విత్తనాల పరిణామం యిదంతా! ఒక యన్‌టి రామారావు మీద, ఒక రాజీవ్‌గాంధీ మీద ప్రజలు ఎంత ఆశ పెట్టుకున్నారు! కాని, ఏమయింది? వ్యవస్థా స్వరూపం మారవలసి వుంది" - అన్నారు వెంకట నారాయణ. డిన్నరయి, రూమ్ చేరుకొనేసరికి యించుమించు ఒంటిగంట. నాలుగున్నరకి కాఫీ కప్పుతో నిద్రలేపాడు రూమ్ బాయ్ - అసలు నిద్ర సరిగా పడితేకద!

'పినాకిని'లో మాతో బాటు రోజా రమణి చక్రపాణి దంపతులు, మాస్టర్ తరుణ్, రాజ్‌కోటి ద్వయంలో ఒకరు తనికెళ్ల భరణి, మహర్షి - ఉత్సవ విజయంలో యితోధిక పాత్రగల యింతమంది ఒక చోట చేరిన మీదట, కబుర్లకేం కొదవ? ఇందరు మంచివాళ్లు ఈ రైలులో వున్నారు కదా అని, పావుగంట ముందుగా చేరుకుంది సెంట్రల్. బైబైలు చెప్పుకుంటూ వారు కోడంబాకమ్ వైపు, మేము మైలాపూరు కచ్చేరీ రోడ్‌కి. ఎవరి దారి వారిది, ఎవరి ప్రపంచం వారిది. కాని, 'స్వాతి' పండగ మాత్రం అందరి మనసున చక్కటి జ్ఞాపకంలా మిగిలిపోతుంది.

. . . . . 25

శాంతా రామభద్రన్ (యునైటెడ్ ఇండియా ఇన్సూరెన్స్) దంపతులు, యింటికొచ్చి పిలిచి వెళ్లారు. అలాగే అబ్బాయి తరఫు వారూ పిలిచి వెళ్లారు. వీరందరూ శారదాంబ (విల్సన్స్ గార్డెన్ స్కూలు) ఫ్రెండ్సూ, స్టూడెంట్సూను, మొదట్లో ఆ విధంగా వచ్చినా, ఆ తర్వాత యింట్లో అందరికీ చేరువవుతారు. కర్పగమ్ అవెన్యూలోని శాంత యింటికి నాలుగైదుసార్లు వెళ్లి వుంటాము; ఎమ్ ఎ చేసిన జయశ్రీ, వారి అబ్బాయీ తెలుసు. రామభద్రన్‌గారి తోనే అంతగా పరిచయం లేదు. కుమార్తె పెళ్లికి ఆయన స్వయంగా వచ్చి ఆహ్వానించారు. అడయార్ శాస్త్రి నగర్‌లోని విజయరాజ్ తిరుమణ మండపంలో, సౌ॥ యమ్మార్ జయశ్రీకి, చి॥ పి. కన్నన్‌కి ఈ సాయింత్రం నిశ్చితార్థం: రేపు వుదయం ఆరూ ఏడున్నర మధ్య సింహలగ్నాన కళ్యాణోత్సవం. నిశ్చితార్థానికి వెళ్లి వధూవరులను ఆశీర్వదించి, పెళ్లి భోజనం చేసి వచ్చాము. జయశ్రీ కన్నన్‌ల దాంపత్య జీవితం శుభప్రదమూ సౌభాగ్యవంతమూ కావాలని మనః పూర్వక దీవనలు.

—యన్నార్ చందూర్

?

"Did Ravana at any time regret his folly of having gone to war with Rama about whom he had heard a lot and rother Vibheeshnaa warned of the futility of it all?" asked Raghu.

"Yes, he did regret just once and he could almost see his doom while his sons spoke words of valour to console him," said Raghu's Father.

"Even at that stage he could have come to terms as he himself was the main culprit," observed Raghu.

"Stopping a war in the middle amounts to acceptance of defeat. How could he do that? Further, Vibheeshana was already crowned by Rama as the future king of Lanka. I'll tell you when that moment of regret occurred.... On the battle-field Kumbha Karna's right hand was cut, the left hand was cut and then both the legs. Still the frame lingering with life was dashing forward. Only with the slicing away of the head did he die. when Ravana came to know of the tragic death of Kumbha Karna, he was dismayed with panic and for o moment he could see his own inevitable end," said Raghu's Father.

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani).*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600103.*

మహా పురుషులు - నాలుగు భాగములు. ఒక్కొక్కటి రు 6-75-మొత్తం సెట్ ; రు 27-00. రచన : కప్పగంతుల మురళీకృష్ణ. ప్రచురణ : క్వాలిటీ పబ్లిషర్స్, రామమందిరం వీధి, విజయవాడ-2.

'చరిత్ర జాతికి జీవము. సుసంపన్నమైన చరిత్ర కలిగిన జాతి గొప్పజాతి. మన భారత దేశము అంతటి ప్రాచీన చరిత్ర కలిగింది. ప్రపంచానికే తలమానికమైన వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, ఇతిహాసాలు ఎన్నో వెలసినవి. ఎందరెందరో మహనీయులు, ఎన్నెన్నో రంగాలలో, ఎంతెంతో కృషి చేశారు' - అని ముందు మాటగా చెబుతూ, సుమారు 70 మంది ప్రఖ్యాత వ్యక్తుల జీవిత సారాన్ని పరిచయం చేశారు రచయిత మురళీ కృష్ణ. ఈ నాలుగు పుస్తకాలలో ఉప్పులూరి గణపతి శాస్త్రి, శకుంతలా దేవి, శొంఠిరామమూర్తి నుంచి అవ్వయార్, త్యాగరాజు, ఏక్‌నాథ్‌ల వరకూ వుంది ఈ పరిచయ వైవిధ్యం.

సుశ్రుతుడు నూటొక్క రకాల సర్జికల్ పనిముట్లు, 14 రకాల బాండేజీలు చెప్పగా, ఆయన తర్వాత మూడు శతాబ్దులకు చరకుడు 'చరక సంహిత' రాశాడు. అది 'అరబిక్' లో యూరప్‌కి వెళ్లి, మళ్లీ మన దగ్గర కొచ్చింది....గుంటూరు సీమకు చెందిన వైదిక బ్రాహ్మణుడు హుళక్కి భాస్కరుడు, వాల్మీకంలోని 24 వేల శ్లోకాలను 15 వేలకు కుదించి భాస్కర రామాయణం రచించాడు.... తెలుగులో గణితశాస్త్రం వ్రాసిన మహాకవి పావులూరి మల్లన.... తిట్టు కవితకు వేములవాడ భీమకవిని, హాస్య కవితకు తెనాలి రామలింగని చెప్పుకుంటే, 'బూతాడక దొరకు నవ్వు బుట్టదు ధరలో - నీతులు బూతులు లోక ఖ్యాతులురా' అంటాడు నీతి కవిత పలికిన చౌడప్ప.... వేమన పేరు మీదుగా అయిదు వేల పద్యాలు వున్నాయి ; అవన్నీ వేమన చెప్పిన దాఖలా కనిపించదు.... శొంఠి రామమూర్తి రూపొందించిన రామపాద సాగర్ ప్రాజెక్ట్ అడుగున పడిపోవడమే గాకుండా, ఆయన బహుముఖ ప్రజ్ఞాసంపదను ఫలప్రదంగా వినియోగించుకోలేక పోయింది ఆనాటి భారత ప్రభుత్వం.

ఏడవ శతాబ్ది కాశ్మీర బ్రాహ్మణుడు భల్లటాచార్యులు సంస్కృత

వాఙ్మయంలోని మొదటి శతకకర్త....
1911లో ఆంధ్ర ప్రచారిణీ గ్రంథ మాల స్థాపించిన ఘనత బాగంటి శేషయ్యది; 'ఆంధ్ర కవి తరంగిణి' పేరుతో 389 గురు తెలుగు కవుల గురించి వ్రాశారాయన.... పాణిని, కాత్యాయనుడు, పతంజలి - ఈ ముగురినీ వ్యాకరణ త్రయంగా పేర్కొంటారు.... కోనసీమ ముంగండ అగ్రహారానికి చెందిన ఉపద్రష్ట జగన్నాధ పండిత రాయలు 'గంగా లహరి' స్తోత్రం, లవంగి ప్రణయగాధ షాజ్‌హాన్ కాలం నాటివి.

మహాభారతం అరణ్య పర్వంలో 14 వేల శ్లోకాలు వున్నాయి; నన్నయ 9 వేల శ్లోకాలను 13 వందల గద్య పద్యాలతో సరిపెట్టాడు. ఎఱ్ఱాప్రెగ్గడ మిగతా 5 వేల శ్లోకాలను 16 వందల గద్య పద్యములతో పూర్తి చేశాడు.... వేదాలకు స్వరం ప్రధానం - గురు ముఖంగా నేర్చుకోవలసినవే గాని, చదివి తెలుసుకోవలసినవి కాదు. 'తే' అను శబ్దం ఉదాత్తంగా పలికితే 'వారు' అని అర్థం; అనుదాత్తంగా పలికితే 'నీ కొరకు' అని అర్థం. అలాగె 'మా' ఉదాత్తంగా అయితే 'వద్దు' అనీ, అనుదాత్తంగా అయితే 'నన్ను' అనీ అర్థం. ఉపనిషత్తులు 108 అయినప్పటికీ, పది మాత్రమే ప్రధానంగా చెబుతారు ....పాల్కురికి సోమనాధుడు సంస్కృతం, తెలుగు, కర్ణాటక భాషలలో 29 రచనలు చేశాడు.... మొదటి తెలుగు శతకం వృషాధిప శతకం. ఆ తర్వాత అన్నమయ్య సర్వే స్వర శతకం. 'తల్లి గర్భమునుండి ధనము తేడెవ్వడు - వెళ్లిపోయెడినాడు వెంటగానడు' - అనే నరసింహ శతకం శేషప్ప కవి రాసినది. ఈశేషప్ప ఏ ధర్మపురివాడో (భూషణ వికాస శ్రీ ధర్మపురనివాస - దుష్టసంహార నరసింహ దురిత దూర) యిప్పటికీ స్పష్టంగా తెలియదు.... ఆకలితో అలమటిస్తున్న ముగ్గురు ఫకీరులను ఆబ్దీకం నాడు భోక్తలుగా చేసి, రామేశ్వరంలో కలపడానికి కాశీ నుంచి తెచ్చిన గంగాజలం దప్పిక గొన్న గార్దభం గొంతులో పోసిన ఏకనాధుడు, మానవతా విలువలకు పట్టం గట్టిన మహనీయమూర్తి.... ఈ నాలుగు పుస్తకాలూ కేవలం లైబ్రరీల కోసం కాదు. ప్రతి తెలుగింటా ఉండవలసినవి - పిల్లలూ పెద్దలూ తెలుసుకోవలసిన జాతి రత్నాల జీవిత పరిచయాలివి. అభినందనీయమగు కృషి చేశారు మురళీ కృష్ణ.

—క్షీరసాగరమ్

'జాగృతి' - స్వదేశీ పారిశ్రామిక ప్రత్యేక సంచిక. నారాయణ గూడా, హైదరాబాదు - 29.... వెల: రు 15-00.

భద్రంగా అట్టే పెట్టుకోవాలనిపించే ప్రత్యేక సంచికలు తెలుగు పత్రికారంగాన వెలువరిస్తున్నది. 'జాగృతి' ఒక్కటే! రాజకీయంగా బిజెపి దృక్పథం కావచ్చు; కాని, సామాజికంగా, దేశశ్రేయస్సు దృష్ట్యా వారు చెబుతున్నది కాదనలేని కఠోర

సత్యం. మల్టీ నేషనల్స్ పాపాల చిట్టాలో పేర్కొన్న వాస్తవాలు, విస్మయ పరుస్తాయి. అమెరికాలోని ఏడు పెద్ద ఆయిల్ కంపెనీలు, ప్రపంచంలోని యావత్తు ఆయిల్ నిల్వలపై గుత్తాధిపత్యం చెలాయించ డం లేదా? తమ లాభాలకు అడ్డు తగిలితే, బడుగు దేశాలలో అంతర్యు ద్దాలు సృష్టించడంలేదా? అంతర్జా తీయ వాణిజ్యంపై తమ పిడికిలి బిగించిన 50 అగ్రశ్రేణి కంపెనీలలో 20 అమెరికావి, 20 యూరోపియన్ దేశాలవి, 8 జపాన్‌వి, మిగతా రెండు లోను ఒకటి దక్షిణ కొరియాది, మరొకటి దక్షిణాఫ్రికాది. రెండు కొరియాలూ ఒకటైనప్పటికీ, దక్షిణ కొరియాలో 40 వేల అమెరికన్ సైన్యం దేనికి? వారి వ్యాపార రక్షణ కోసం. బొహేమియాలోని ఆయిల్ పరిశ్రమ చేజిక్కించుకొనేం దుకు, ఆ దేశాధ్యక్షుని కిమూడు లక్షల డాలర్లూ ఒక హెలికాప్టరూ లంచంగా యిచ్చారట. మన మార్కెట్‌లో పేరుబడ్డవి 218 రకాల మందులు వున్నాయి - అందులో 135 మల్టీ నేషనల్స్‌వి.

సాంకేతిక పరిజ్ఞానం విషయంలో అన్య దేశాలపై ఆధార పడకతప్పదు. కాని, ఎంత తక్కువగా ఆధారపడితే అంత మంచిది. ప్రాచీన విజ్ఞానాన్ని, ప్రాచీన పరిశ్రమలను, ప్రాచీన వ్యవ స్థలను సమస్తం ధ్వంసం చేశారు వలసాధిపతులు - తమ స్వలాభం కోసం. ఈ 45 ఏళ్ల స్వాతంత్ర్యం లోను మన మార్గం మనం తెలుసుకో లేక, యింటా బయటా అప్పుల పాలవుతున్నాము. గాంధీగారెప్పుడూ వికేంద్రీకరణ, గ్రామ స్వరాజ్యం వైపు మొగ్గేవారు. కాని, పరిస్థితుల దృష్ట్యా మన ఆర్థికరంగం కేంద్రీ కృతమయింది - పల్లెసీమలు పేద రికంతో కొట్టుమిట్టాడు తున్నాయి - పట్నాలు అవాంఛనీయ సంఘ విద్రోహ శక్తులకి ఆట పట్టవు తున్నాయి.

పి వి ప్రభుత్వం గురించి వాజ్ పాయ్ అంటారు: 'లిబరలైజేషన్ ఈ రోజు కూడా, మేము సమర్థిస్తూనే ఉన్నాం. అయితే, ఈ లిబరలైజేషన్ ప్రక్రియ నిజాయితీగా జరగడం లేదని మాత్రమే మేం చెబుతున్నాం.... హర్షద్ మెహతా విషయంలో గాని, బ్యాంకులలో పెద్ద ఎత్తున జరిగిన గోల్‌మాల్‌లో గాని లిబరలైజేషన్ విధానాల పాత్ర ఎంత మాత్రం లేదు .... ఆర్థిక సంక్షోభంనుండి బైట పడేందుకు, ప్రభుత్వం ఏవైనా చర్యలు తీసుకుంటే, అందుకు మేము వ్యతిరేకించబోము.... ఆర్థిక సంస్కర ణలు లేకుండా ప్రగతి సాధ్యం కాదు .... ప్రభుత్వ రంగాన్ని విచక్షణా రహితంగా పెంచి వేయరాదని చాలా కాలం నుండి మేం చెబుతూ వచ్చాం.'

స్వదేశీ భావనకు ప్రాధాన్యత నిస్తే గాని, కుటీర పరిశ్రమలు, చిన్న తరహా పరిశ్రమలు నిలదొక్కుకో లేవు. దేశాభ్యున్నతిలో తమ సము

చితపాత్ర నిర్వహించలేవు. విలువైన వ్యాసాలతో బాటు చక్కటి కథలు వున్నాయి ఈ ప్రతేక సంచికలో.

—సుమతీ సాగర్

## ఈ మధ్య అందినవి :

శారదా కళాశాల దశాబ్ది ఉత్సవ సంచిక, విజయవాడ.

ప్రజా సాహితి - కన్యాశుల్కం ప్రదర్శన శతజయంతి సంచిక, 29-28-67 దాసరివారి వీధి, విజయవాడ - 2.... రు 10-00.

మానసలీల - పద్య సంపుటి నాయని కృష్ణ కుమారి.... ప్రతులకు : వి మధుసూదనరావు, 8-3-898. 2, నాగార్జున నగర్, హైదరాబాదు - 873.... రు 6-00.

సూక్తులు-హితోక్తులు-20 సంకలనం : కప్పగంతుల మురళీకృష్ణ. క్వాలిటీ పబ్లిషర్స్ రామమందిరం వీధి, విజయవాడ-2 ... రు 25-00.

కాలుష్యం - నివారణ. కప్పగంతుల మురళీకృష్ణ. గంగాధర పబ్లికేషన్స్, రామ మందిరం వీధి, విజయవాడ - 2.... రు 4-00.

ప్రతిభా వంతులు - మొత్తం పన్నెండు భాగాలు (225 మంది సంక్షిప్త జీవిత చరిత్రలు) ఒకొక్క భాగం : రు 5-75. కప్పగంతుల మురళీకృష్ణ.... గంగాధర పబ్లికేషన్స్, రామమందిరం వీధి, విజయవాడ-2.

సైన్స్‌ఫిక్షన్స్

# జూలియస్

## అన్నపూర్ణా రెడ్డి

గడిచినకథ : డాక్టర్ మల్హోత్రా 'కాజిల్ లోలిటా'కు, మిత్రులు రాజేష్, షార్మాలు వచ్చారు నూతన సంవత్సర వేడుక సందర్భంగా. మిత్రత్రయం ప్రతి న్యూయియర్‌కి విధిగా కలుసుకుంటారు. ఈ సంవత్సరం మల్హోత్రా మేనకోడలు సునీత కూడా ఉంది. ఆగంతుకునిలా వచ్చాడు జూలియస్. UFO ల గురించి మాటలు వచ్చాయి. కొత్తసంవత్సర వేడుక లయాక, ఆ రాత్రి అందరూ వెన్నెల విహారానికి బయలు దేరారు....

"జూలియస్ ఇక్కడికెలా వచ్చాడు .... ఏదైనా ఫౌల్ ప్లే కాదు కదా!" .... అంటూ ... కాస్త వెనక పాటుగా నడిచి వస్తున్న షార్మా, రాజేష్‌లు లోనికి వచ్చి గోడ వారగా నుంచున్నారు.

"బేబీ, నీ టార్చిటియ్యి...." అని సునీత అందించిన టార్చి అందుకొని ఫోకస్ చేశాడు.... దానికీ అదే గతి పట్టింది.

సునీత చేతులు వెనుకగా పెట్టుకొని గోడవారగా నుంచుంది....

'షిట్స్' తన్నుకొచ్చింది కోపం... టార్చిని విసిరికొట్టినంత పనిచేసి, కుడి మోకాలు మడిచి.... ఎడమ మోకాలు నేలకు మోపి, జూలియస్ ప్రక్కన కూర్చున్నాడు మల్హోత్రా.

లోనికి వస్తున్న ఆ పిసరంత వెలుతురూ.... బంద్ైపోయింది.

"ఏమిటీ టోటల్ డార్క్‌నెస్!... ఏమైంది?" అనేసరికి సర్ మన్న శబ్దం, క్లిక్ మన్న శబ్దంతో కలిసిపోయింది.

'గాలికి తలుపు మూసుకుందిలా వుంది.... కొంచెం తెరిచి పెట్టండి' తలత్తకుండానే హుకుం జారీ చేశాడు - డాక్టర్ మల్హోత్రా.

ఎడమ చేయి చాచి తలుపు తడిమి .... "నో....నో...." అంటూ కంగారుగా అరిచింది సునీత.

కూర్చున్న చోటునుండీ అమాంతం పైకి లేచి చీకట్లో అందాజుగా ముందు కడుగేసి 'వ్వాట్ హేపెండ్, బేబీ, ఏం జరిగింది.... ఆర్యూ ఆల్‌రైట్...." అన్నాడు మల్హోత్రా.... అసలే అడవి .... చీకటి, చలి ఏ విషపురుగో చేయి ముట్టుకుందేమోనని.... భయంతో.... హెచ్చు స్వరంతో.... అరిచాడు.

"మామయ్యా.... ఈ తలుపు తెరుచుకోవడం లేదు.... ఐ.... థింక్

వి ఆర్ ట్రాప్డ్" అంది భయంతో "వ్వాట్...." అంటూ డాక్టర్ షార్మా రాజేష్‌లు చీకట్లో ద్వారం వైపు జరిగారు.

బంద్దైపోయిన ద్వారం మీద ఎంత బాదినా భుజబలం చూపినా పిసరంతైనా కదల్లేదు. తెరుచుకోలేదు. లోపలంతా కటిక చీకటి.

చేతులతో గోడలు తడిమి.... "అంకుల్ ఇది మామూలు ఝోప్డీ కాదు.... వి ఆర్ ట్రాప్డ్ మామయ్యా" అంది.

షార్మా భుజంతో ఢీకొని మరో మారు తలుపు తెరవడానికి విఫల ప్రయత్నం చేశాడు.

చీకట్లో చూడ్డానికి అప్పుడప్పుడే అలవాటు పడుతున్న కళ్లు, ఆ గోడల మధ్య ఎక్కడైనా తలుపుగానీ, కిటికీ గానీ అవుపిస్తుందేమో అని వేగంగా చలించాయి. గోడ నాధారం చేసుకొని గోడ వెంట తడుముతూ ముందుకు నడిచింది.... గోడ వెంట చేయి చాచి... అందిన మేరా తడమ సాగింది.

ఎక్కడా ఏలాటి ఆధారం అవు పించలేదు. ఆ చిన్న గదిలో.... జూలి యస్ పరిస్థితి ఎలా వున్నా, నలుగురు వ్యక్తులు ఊపిరీ పీల్చడానికి స్టఫీగా ఫీలవసాగారు.

అందరూ గోడ నాధారం చేసుకొని బైటపడే అవకాశం కోసం ప్రయ త్నించడంలో.... వున్నట్టుండి.... ఒక్కసారి గుప్పున లైట్లు వెలిగాయి... ఒక్క రంగుకాదు... ఎరుపు, పసుపు, ఆకుపచ్చ లైట్లు... న్యూయిర్‌కు స్పెషల్‌గా అలంకరణ చేసినట్టు గోడల్లో మిణుకు మిణుకు మంటు న్నాయి. "లైట్లు వచ్చాయి... ద్వారం తెరవండి" అంటూండగానే ఒక లాటి జర్క్ ఇచ్చినట్టయింది... 'వ్వాట్ హేపెండ్...' అంటూ అర్థం కాని ఆ పరిస్థితికి ఒకరి ముఖాలొకరు చూచుకొనే సరికి ఆ ఇల్లు కదులు తున్నట్లు అనిపించింది మనసుకు.

పైకి వెళ్తున్నట్లు అనుభూతి కల గ్గానే.... "మామయ్యా" అంటూ గట్టిగా అరిచింది సునీత.

"స్టాప్... స్టాపిట్ స్టాపిట్ ఐ సే..." అంటూ పెద్ద గొంతుకతో అరిచాడు మల్హోత్రా. భయాందోళనలు ఎదలో చోటు చేసుకోవడంతో మేనమామకు దగ్గరగా జరిగి మామయ్యా... ఐ దింక్ వి ఆర్ బీయింగ్ కిడ్‌నాప్డ్ !" అంది...

'బట్ హూ' వత్తిపలికాడు మల్హోత్రా. అరుణిమ అలదుకొన్న నేత్ర ద్వయం జ్వలిస్తున్నాయి.

"ప్లీజ్! స్టాపిట్ మల్హోత్రా.... స్టాపిట్...." - నిస్సహాయంగా అరి చాడు కాంతిదేవ్ షార్మా....

'ఈ గొడవకంతా కారణం ఈ దిక్కు మాలిన వెధవ.... - వీణ్ణి ఈడ్చి డొక్కలో ఒక్కటి తన్నితే కానీ.... ఈ అనర్థానికి మూలకారణం తెలీదు....' - కోపంతో కుడికాలు వెనక్కు లాగాడు రాజేష్.

'డోంట్ రాజేష్ డోంట్ డూ దట్.... యూ ఈడియట్....' కళ్ళ నుండీ విస్ఫులింగాలు వర్షిస్తూంది.

పెద్ద గొంతుకతో కఠినంగా అరిచాడు డాక్టర్ మల్హోత్రా.

"దెన్.... యు.... స్టాపిట్.... డాక్టర్ మల్హోత్రా! ఐ.... వాంటు గో .... హోమ్....' అంతకన్నా పెద్ద గొంతుకతో.... అరిచాడు రాజేష్....

"మీ.... టూ...." వంత పాడాడు షార్మా.

"కమాన్.... బిఫోర్ ఇటీజ్ టూ లేట్.... లెటజ్ గెటౌట్ ఆఫ్ దిస్ డెత్ ట్రాప్...." అంటూ స్విచ్‌ల మీద చేయివేసి అడ్డ దిడ్డంగా నొక్క బోయారు షార్మా రాజేష్‌లు.

బిక్క చచ్చి మేనమామకు అంటుకు పోయి నుంచుంది సునీత.

"ఇదంతా నీ మూలకంగా జరిగింది.... ఇదంతా ప్రీప్లాన్డ్ కావచ్చు.... నిన్నొది లేదు లేదు.... అసలు.... నిన్ను".... డాక్టర్ మల్హోత్రా మీదకు లంఘించి - పీక పట్టుకున్నాడు రాజేష్ కోపంతో - నిలువెల్లా వొణికిపోతున్నాడు....

షార్మా మధ్యకు జొరబడి బలవంతాన రాజేష్‌ను ప్రక్కకు లాగి.... "లేపు, ఆ వెధవను లేపు.... వాడికి తెలుసు ఆ కిటుకు... వాడే ఆపగలడు. ఈ విచిత్ర పరిస్థితిని...." డాక్టర్ మల్హోత్రాను కుదిపిస్తూ.... షార్మా రొప్పసాగాడు.

"అహ్హాహ్హాహ్హా .... అహహ్హాహ్హా ...." అని పెద్దగా రాక్షసిలా పడిపడి నవ్వి .... గట్టిగా ఏడ్చేశాడు మల్హోత్రా.

నిస్సహాయ స్థితిలో నిద్రాణంగా వున్న శోకం అందరిలోనూ ఒక్కసారి కట్టలు తెంచుకుంది.... మిత్రత్రయం అలా బేలగా ఏడ్వడం చూచి, ధైర్యం చెడిన సునీత క్రింద చతికిలపడి, భోరుమని ఏడ్చేసింది....

సునీత ఏడ్పుతో డాక్టర్ మల్హోత్రా ఈ లోకంలోనికి వచ్చాడు....

"బేబీ...., అమ్మా...., బేబీ.... డోంట్ వీప్....' క్రింద కూర్చొని, సునీతను వొడిలోకి లాక్కొని ... 'టేకిటీజీ మైడియర్, బేబీ.... టేకిట్ ఈజీ....' అంటూ ఓదార్చాడు.

డాక్టర్ షార్మా, రాజేష్‌లు కూడా ప్రక్కనె వెతికిల పడ్డారు....

ఎగసి పడుతున్న సునీత వీపుపై నిమిరి లాలనగా రాస్తూ...." బేబీ . . కంపోజ్ యువర్ సెల్ఫ్.... డోంట్ వీప్...." అంటూ హితవు చెప్పాడు మల్హోత్రా....

మంకెన పూవులాటి కళ్ళెత్తి "మామయ్యా ఈ స్విచ్‌లన్నీ ట్రై చేయండి క్రిందకు దిగిపోగలమేమో" అంది.

అప్పటికి మానసిక ఆందోళన ఒకింత సర్దుకొని కాస్త స్థిమితంగా ఆలోచించే స్థితికొచ్చారు మిత్రత్రయం.

"మల్హోత్రా .... జూలియస్ .... సంగతే మరిచాము.... వీడికేమైంది.... ఎందుకిలా 'శవంలాగ పడున్నాడు. వాడి సంగతి కాస్త చూడు.... అత గాడు లేస్తే తప్పా.... మనకు విముక్తి లేదులా వుంది...." అన్నాడు షార్మా.

జూలియస్‌ను వెల్లకిలా తిప్పి గుండె మీద అరచేయి పుంచి.... హార్ట్‌బీట్ .... అంచనావేసి.... పల్స్‌రీడ్ చేయ డానికి వ్యర్థ ప్రయత్నం చేస్తూ "నో డౌట్ హి ఈజ్ అలైవ్.... కానీ అన్ కాన్షస్‌గా వున్నాడు" అన్నాడు మల్హోత్రా....

"పోనీ, మనమే ఏదైనా ఆలోచన చేద్దాం.... స్విచ్చిలన్నీ ఒకదాని వెంట ఒకటి నొక్కేద్దాం" అన్నాడు రాజేష్.

కొన్ని నిముషాలదాకా ఏం మాట్లాడకుండా వుండిపోయాడు మల్హోత్రా. ..

తరువాత గొంతు సవరించుకొని

"డియర్ ఫ్రెండ్స్! డెస్టిని అనేది తప్పించుకోవడం ఎవరి తరమూ కాదు.... ఇప్పుడు తెలిసీ తెలియక అన్ని బటన్స్ నొక్కితే మనం ఖచ్చితంగా నేలకు సుఖంగా దిగితే ఏ గొడవ లేదు. మోస్ట్ వెల్‌కమ్. కానీ అందుకు భిన్నంగా జరిగితే .... మనం .."

"చస్తే చస్తాం. ఇప్పుడున్న పరి స్థితి అంతకన్నా మెరుగైందేమీ కాదు...." కసిగా అరిచాడు రాజేష్.

"ఎస్ ... చావు!.... చెక్!". . ఈలా క్రిందకు సవ్యంగా దిగుతా మన్న ఆశ లేదు. అట్లని చావుని తప్పించుకున్నామన్న సంబరమూ లేదు.... మనిషికి చావు ఒకే ఒకసారి వస్తుంది... ఇటీజ్ ఇన్ఎవిటబుల్ - లైఫ్ స్పాన్‌లోనే ఏ మంచిని సాధిం చినా చెడును సాధించినా... మనం తీసిన ట్రంప్ కార్డ్ అలాంటిది లెటజ్ ఫేసిట్ యాజ్ ఎ ఫ్రెండ్స్, మనం ప్రస్తుతం.... ఒక [illegible] అంతరిక్ష నౌకలో ట్రాప్ అయి పోయాము.... ఇది కేవలం స్వయం కృతాపరాధం.... తెలియక చేసినా తెలిసి చేసినా, దీని పర్యవసానాన్ని అనుభవించక తప్పదు .... మిస్టర్

జూలియస్ రివైవ్ అయి లేవగలిగితే వెల్ అండ్ గుడ్.... ఏదైనా క్లూస్ తెలుస్తాయి.... లేదంటే.... లెటజ్ బిడ్ గుడ్ బై టు అవర్ మదర్‌లాండ్, ది గుడ్ ఎర్త్.... జరిగిపోయిందాని కన్నా... . జరగాల్సిందాన్ని గురించి ఆలోచించడం తెలివైన వారి లక్షణం !".... ఫిలసాఫికల్‌గా మాట్లాడి మిత్రుల ముఖాల్లోకి కలియ జూచాడు మల్హోత్రా....

ఒకరి చూపుతో మరొకరి చూపులు చిక్కడి పోయాయి కొన్ని క్షణాలు....

"దేరీజ్ నో వే టు ఎస్కేప్" అంటూ చిరునవ్వుతో తల దించాడు మల్హోత్రా...

అప్పటికి కాస్త తేరుకున్న సునీత "మామయ్యా... నా కర్థం కానిది ఒక్కటే... మనం ఉదయమే కదా UFO గురించి చదివాము. మరైతే... ఈ అంతరిక్ష నౌకనే ఎవరైనా పసిగట్టి వుంటారంటావా ?" అంది...

"తెలియదు బేబీ !"

"జూలియస్ ఇతర గ్రహవాసి అనుకోవాలా !"

"తెలియదు"...

"ముక్కు ముఖం తెలియని వెధవ అర్ధరాత్రి ట్రావెలర్‌ని అంటూ గుమ్మంలోకి వచ్చాడో లేదో, ఇంట్లో కలిపేసుకొని అతిది మర్యాదలు చేసి, నీ గొప్ప చాటుకున్నావే కానీ, వాడు ఏ పారినరో అనుకున్నామే గానీ .... వాడి జాతి, నేషనాలిటీ అడగనే లేదు ... నీకు తిక్క"... కసిగా తిట్టాడు రాజేష్.

"మీరు గమనించారో లేదో.... సైన్సు ... టెక్నాలజీ గురించి అడిగి

నప్పుడు.... తాను భూలోక వాసిని కాదన్నట్టు అర్థం స్ఫురించింది అత గాడి మాటలో!"

తనకు కలిగిన సందేహం చల్లగా బైట పెటాడు షార్మా...

"ఏం జరిగివుంటుందింతకూ మామయ్యా ?"

"మీరంతా అనుకొంటున్నట్టు అతను ఏలియన్ అయివుంటే మాత్రం .... ఏదో బలవత్తరమైన కారణంవల్లె స్పృహ కోల్పోయాడను కోవాలి !"

"కానీ కాకపోనీ... కాస్సేపు స్పేస్ మాన్ అనుకొంటే ఏం పోయింది కానీ ... మన ఖర్మ ఈలా కాలి... వీడితో సహా... అంతరిక్షంలోకి వెళ్ళిపోతు న్నాము.... హేపి న్యూ యియర్.... బోనస్..." అన్నట్లుగా తలకొట్టు కున్నాడు రాజేష్.

"పోనీ అలాగే అనుకో రాజేష్... ఇప్పుడు మనకు ఒక గమ్యం లేదు, లక్ష్యం లేదు... మనం మన డెసిషన్స్ చేసుకోవాలి. దిస్‌క్రషన్స్ వుపయో గించు కోవాలి !"

"వి ఆర్ స్పేస్ ట్రావెలర్స్... గోయింగ్ టు టేక్ ది యునీక్ స్పేస్ ట్రావెల్ !".... సరదాగా నవ్వాడు మల్హోత్రా...

గుడ్‌లక్ అంటూ... బొటన వ్రేళ్ల పైకెత్తి చూపించాడు. అందరూ అలాగే చేశారు...

మిత్రులు ముగ్గురి ముఖాల్లో మునుపటి దిగులు, చింత, పిరికితనం లేదు... షీర్ దిటర్మినేషన్ జ్యోతిలా వెల్గుతోంది కళ్ళలో...

అప్రయత్నంగా జేబులు తడుము కున్నాడు మల్హోత్రా. తాళంచెవుల గుత్తి చేతికి తగిలింది.

ఆప్యాయంగా చేతిలోకి అందుకొని ... "ఐ హేవ్ లాక్‌డ్ ఔట్ మై సెల్ఫ్ ... అలాంగ్ విత్ మై డియరెస్ట్ ఫ్రెండ్స్..." తాళంచెవుల గుత్తిని పెదిమెలకు అనించుకొని జేబులో వేసుకున్నాడు మల్హోత్రా.

"మామయ్యా... మనం... నేరుగా పైకి వెళ్ళిపోయి కొన్నివందల కిలో మీటర్ల దూరం వచ్చేసి వుంటామేమో ... స్పేస్ షిప్ అన్న తరువాత... ఏదో ఒక ట్రావెల్‌కోడ్ గానీ, కంట్రోల్ పవర్‌తో కాంటాక్ట్ చేసిన సదుపాయం కానీ వుండకపోదు కదా ... మిస్టర్ జూలియస్ లేవగలిగితే వెల్ అండ్ గుడ్... లేకపోతే మనమే ట్రై చేస్తైనో" అంది సునీత.

"బేబీ,... యు ఆర్ కరెక్ట్... కానీ నిద్ర ముంచుకొచ్చేస్తూంది... బ్రెయిన్ ఫెటీగ్"... మల్హోత్రా కళ్లు వాలిపోతు న్నాయి.

అప్పటికే.... కూర్చొనే నిద్రకు జోగుతున్నారు షార్మా, రాజేష్‌లు.

"మీరు కూడా పడుకోండి మామయ్యా.... కాస్సేపు నేను మేలు కొని వుంటాను .... నాకు నిద్ర అనిపిస్తే మిమ్మల్ని లేపుతాను".... అంది సునీత.

నిద్ర చోటెరుగదు.... ఆకలి రుచెరుగదు - అని సామెత...

(ఇంకా వుంది

